# మానిషాదమ్

నాటిక.




డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

# మా నిషాదమ్

['మా నిషాద' శ్లోక సంబంధి గాథ; తదితర నాటికలు]



రచన :

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

తెలుగు విభాగం, నాగార్జున విశ్వ విద్యాలయం




శ్రీ గిరిజా ప్రచురణలు

విద్యాలంకార్, బి - 31

శ్రీనివాస నగర్ కాలని

గుంటూరు - 6

డాక్టర్ సి. యస్. శాస్త్రి (అమరేంద్ర)
ప్రిన్సిపాల్ : జె. కె. సి. కళాశాల
ఎగ్జిక్యూటివ్ సభ్యులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

గుంటూరు-6
26—1—1981

# ప రి చ య ం

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తంగారు రచించిన నాటికల సంపుటం లోని నాలుగు రూపకాలూ పరిశీలించాను.

క్రౌంచపక్షి హృదయంనుంచి ఉప్పొంగినశోకం ఆదికవి హృదయాన్ని కరిగించి శ్లోక రూపం పొందిన సన్నివేశం మానిషాదమ్‌లో చిత్రించారు. పూర్ణమానవత్వానికీ దివ్యత్వానికీ నడుమ సేతువుగా నిలిచిన రామచంద్రుని ఆదర్శజీవితాన్ని సూచన చేస్తూ రచించిన ఈ రూపకంలో రామాయణ మహాకావ్యాన్ని విహంగవీక్షణగా ప్రదర్శించారు.

వేదాలను నాలుగుగా విభాగంచేసి అష్టాదశ పురాణాలనూ విరచించిన వ్యాసమహర్షి అంతరంగంలో చెలరేగిన అసంతృప్తీ, అశాంతీ, శ్రీమద్భాగవతావిర్భావంలో చిత్రించారు. భక్తిరసంతో ఆర్ద్రమైన హృదయం భగవంతుని గుణకీర్తనతో ధన్యత్వం పొందిన విధానం ఈ రూపకంలో ఆవిష్కరించారు. "సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గము గలదే"అన్నారు త్యాగరాజు. "హరినామ స్తుతిలేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీకరమై యుండ దయోగ్య దుర్మలినవ త్కాకోల గర్తాకృతిన్" అని భక్తకవిశేఖరుడు పోతన ఉద్ఘాటించాడు. నారద భక్తిసూత్రాలనూ, నారదుని జన్మవృత్తాంతాన్నీ ఈ రూపకంలో ప్రస్తావించి సాహిత్యానికి భక్తివల్ల కలిగే శక్తినీ, రక్తినీ, విముక్తినీ ఈరచనలో స్ఫురింపజేశారు. మేధావాదులకు అందని ఆనందప్రాప్తిని హృదయవాదులు సాహిత్యంలో సాధించగలరనే

పరమసత్యాన్ని ఈ రూపకంలో ప్రస్ఫుటం చేశారు. దుర్మేధవల్ల భవసాగరం దాటటం దుస్సాధ్యమనీ, హరిగుణగణములను గానంచేసే వాక్కులకే మందార మకరందమాధుర్యం లభిస్తుందని సూచించారు. నిర్మల నిశ్చల భక్తికి నిలయమైన హృదయమే దైవమందిరంగా భాసించగలదని నారద చరిత్రం నిరూపిస్తున్నది. ఈ రూపకరచనలో పురుషోత్తంగారి హృదయ మథనం వినిపిస్తున్నది. రచనను ఒక సాధనగా ఆరాధనగా నివేదనగా భావించే ఉత్తమ భారతీయ సంప్రదాయం ఈ రూపకానికి ప్రాతిపదిక.

ఆగ్రహంతో కాశీపురాన్ని శపించిన వ్యాసుడు అన్నపూర్ణాదేవి వాత్సల్యామృతాన్ని, 'సుధాధారా రసస్యందియై ఉల్లంబున్ తనియించు పలుకును' ఆలకించి సంయమీశ్వరుడైన సన్నివేశాన్ని వ్యాసాగమనంలో చిత్రించారు.

శైవసంవిత్సార మరాళ రత్నమైన నత్కీరుని కథద్వారా ఉద్యమించి మానవుడు మహోన్నతుడు కాగలడు, ఎంత శాపోపహతుడైనా స్వయంకృషివల్ల పరమ మాహేశ్వర కృపాపాత్రుడు కావచ్చును, అనే ఉత్తేజకరమైన ప్రబోధం అందిస్తున్నారు.

"పూర్వేతి వృత్తాల్ని ప్రక్రియాభేదంతో సవిమర్శకంగా చాలవరకు ఆయా కవుల భాషలోనే విరచించి వాటిపట్ల నూతనాసక్తి కలిగించాలని" పురుషోత్తంగారు చేసిన కృషి ప్రశంసనీయం. భారతీయ సాహిత్య సౌధానికి ఆధారశిలలేవో ఈరూపకాలద్వారా డాక్టరుగారు ప్రకటించారు. సంప్రదాయాలకు దూరమైపోతున్న యువతరానికి భారతీయ సాహిత్య విశిష్ట సంపదను గుర్తుచేస్తున్న ఈ శ్రవ్యనాటికలు 'సుజ్ఞాన' పేటికలు.

—అమరేంద్ర

# నా మా ట

పూర్వోక్తి వృత్తాల్ని ప్రక్రియాంతరంలో సవిమర్శకంగా చాలవరకు ఆయా కవుల భాషలోనే విరచించి, వాటి పట్ల నూతనాసక్తి కలిగించ టానికి చేసిన ప్రయత్నమిది.

ఇలాంటివి, పత్రికల్లో ప్రకటిత మైనవి ఇంకా ఉన్నా ఈ క్రింది నాలుగు మాత్రమే ముద్రింప గల్గుతున్నాను.

—రచయిత

## నాటికలు

# ప్రార్థన

శరత్కాల చంద్రికవలె
        చల్లగ చిరున వ్వొలుకుచు
నల్ల కలువ కాంతు లీను
        కన్నుదోయి కదలియాడ
అరవిందము నందగించు
        సుందరమౌ ఆస్యముతో
అలరెడి యరవిందాసన
        సుందరి! ని న్నుపాసింతు॥
ఆపాత మధురమ్ము
        ఆలోచ నామృతము
సంగీత సాహిత్య
        దుగ్ధమ్ము లానగా
సతతమ్ము శిశువునై
        నీయంక పీఠిలో
వర్ధిల్లు సుకృతమ్ము
        చేకూర్పు మోతల్లి ॥

క్రౌంచమిథున రాగదళన
జనితశోక శ్లోకవర్షి!
ఓ తపస్వి! ఓ వచస్వి
వాల్మీకికవీ!! నమస్సు!!!

* * *

కవితా సహకారవృక్ష
శాఖాపత్రిముల దాగి
'రామ! రామ!' యను కుహూకుహూ
సుమధురమౌ కూజితముల

లోకమ్ములు పులకింపగ
అనారతము ప్రబోధించు
కవికోకిల వాల్మీకికి
ప్రవిమలమతి వందించెద.



మహారాజశ్రీ
బూదరాజు హనుమంతరావుగారు



శ్రీమతి
బూదరాజు సత్యవతిగాయ

# అంకితము

శ్రీ బూదరాజు సత్యవతీ హనుమంతరావు మహోదయులకు

భారత రామాయణేతిహాసాలలో
బద్ధమతియై బ్రదుకు పండించె నెవరు?
భావనారాయణ స్వామి ఆలయమందు
నిత్యమ్ము హరికథల్ చెప్పించె నెవరు?
లయ తాళ బద్ధముల్ గావింప తత్కథల్
తానె తాళము పట్టు దక్షు డెవరు?
సరసమౌ సంగీత సాహిత్య సాధనమె
పరమార్థమని సదా భావించె నెవరు?
సంగీత భారతిని అర్ధాంగిగా పొంది
తానె బ్రహ్మగ విరాజిల్లె నెవరు?
నాకు గాంధర్వమ్ము నేర్పింప యత్నించి
అన్యత్ర విజయు గావించె నెవరు?
తన దుహిత శారదను అన్వర్థనామగా
భావించి సఫలుడై జీవించు నెవరు?
తన సంపదల్ లోక కళ్యాణ మొనగూర్ప
దాన ధర్మము లందు తనిసె నెవరు?

సత్య శివ సుంద రారాధనాసంస క్తి
నిత్య జీవితయాత్ర సాగించె నెవరు?

సతి సత్యవతి సేయు సేవానుర క్తితో
వార్ధకము సార్థకము గావించె నెవరు?

అట్టి శ్రీ బూద రాడ్వంశ రాకాశశికి
సత్యవతి సముపేత హనుమంతరావునకు
అంకితం బొనగూర్తు నీ చిన్ని కృతిని
అక్షర నిబద్ధమౌ నిత్య సంస్మృతికి॥



# మా నిషాదమ్

పాత్రలు

వాల్మీకి

నారదుడు

బ్రహ్మ

భరద్వాజుడు [ప్రధాన శిష్యుడు]

శిష్యులు

*　　*　　*

మా నిషాద। ప్రతిష్ఠాం త్వ
మగమః శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిథునాదేక
మవధీః కామమోహితమ్।

కామమోహ పరవశమౌ
క్రౌంచమిధునమం దొక్కటి
కూల్చినాడ వోనిషాద।
కనవు శాశ్వత ప్రతిష్ఠ॥

సీతా సాధ్వీ వ్యామో
హితుడౌ రాక్షసవధచే
మానిషాద! నీకిలలో
కలిగె శాశ్వత ప్రతిష్ఠ॥

తారా వ్యామోహితుడౌ
వాలి నొక్క కోల గూల్ప
మానిషాద। నీకు కల్గె
మాసిపోని మహిత కీర్తి॥

సీతా పరిణయ సూచన
'మా నిషాద' బాలకాండ;
తండ్రిమాట పాటించు 'ప్ర
తిష్ఠ' యే అయోధ్యకాండ;
ఋషుల బాస తీర్చు 'శాశ్వ
తీస్సమా' అరణ్య కాండ,
'క్రౌంచ మిథున' శబ్దసూచి
వాలివధ కిష్కింధ కాండ;
'క్రౌంచి' బాధ, సీత విరహ
వేదన సుందర కాండ;
క్రౌంచ హనన రావణవధ
యుద్ధకాండ నిరూపితము.

*　　　*　　　*

[అది తమసా నదీతీరం. వాల్మీకి మహర్షి ఆశ్రమం. గురుకులం. బ్రహ్మచారులు ముక్తకంఠంతో నారాయణోపనిషత్తు పఠిస్తుంటారీరీతిగా]

శిష్యులు

నారాయణాత్ ప్రాణో జాయతే
మనస్సర్వేంద్రియాణి చ ఖం వాయుర్జ్యోతి
రాపఃపృథివీ విశ్వస్య ధారిణీ
నారాయణాత్ బ్రహ్మా జాయతే
నారాయణా ద్రుద్రో జాయతే
నారాయణా దింద్రో జాయతే
నారాయణాత్ ప్రజాపతయః ప్రజాయన్తే
నారాయణా ద్ద్వాదశాదిత్యా రుద్రా
వసవస్సర్వాణి చ ఛందాగంసి
నారాయణాదేవ సముత్పద్యన్తే
నారాయణే ప్రవర్తన్తే
నారాయణే ప్రలీయన్తే

[ఈ పఠనంలో నుండి ఈక్రింది పాట వినిపిస్తుంది. దీన్ని పాడుకొంటూ నారదుడు ప్రవేశిస్తాడు]

నారదుడు

**పాట :**

ఆత్మారామా! సరససద్గుణా!!
నారదసన్నుత! నారాయణా!!!

మానవాళి కాదర్శము నిల్పగ
అవతరించితివి ఆర్షావనిపై ॥ఆత్మారామా॥
వేదధర్మములు వెన్నముద్దలై
కథాకథన మాధుర్యము నందుత: ॥ఆత్మారామా॥
సకలరసమ్ముల కావాసమ్మై
అలరెడి నీకమనీయ చరిత్రమె
కాంతహృదయులకు కావ్యవస్తువై
అఖండ బ్రహ్మానందతుల్యమౌ
రసానందపరవశుల నొనర్చుత: ॥ఆత్మారామా॥

భరద్వాజుడు

వాల్మీకి గురుదేవులకు శిష్యుడు భరద్వాజుడు ప్రణమిల్లుతున్నాడు. ఈసురుచిర సుప్రభాత సుముహూర్తంలో వాగ్విదాంవరులు నారదమునీంద్రులు మన ఆశ్రమాభిముఖంగా వేంచేస్తున్నారు. అదిగో! ఆ గానమాలకించండి!

వాల్మీకి

అవునవును, మహదాగమనం! మహానందదాయకం!! మహత్తర శుభోదర్కం!!! ఎంత మంచి శుభవార్త వినిపించావు! శిష్యా! భరద్వాజా! ఆంతేవాసుల నందరిని నారాయణోపనిషత్పఠనాన్ని కొనసాగిస్తూనే ఆ బ్రహ్మమానస పుత్రునకు ప్రత్యుత్థానం చేయరమ్మని ఆదేశించు. నేను మిమ్మల్ని అధిగమిస్తాను.

భరద్వాజుడు

చిత్తం గురుదేవా!

శిష్యులు

అథ నిత్యో నారాయణః
బ్రహ్మా చ నారాయణః
శివశ్చ నారాయణః
శక్రశ్చ నారాయణః
ద్యావాపృథివ్యౌ చ నారాయణః
కాలశ్చ నారాయణః

వాల్మీకి

బ్రహ్మచారులారా! అందులో ఈపంక్తిని చేర్చి ఏకోన్ముఖంగా ;లకండి! "నారదశ్చ నారాయణః"

శిష్యులు

నారదశ్చ నారాయణః
నారదశ్చ నారాయణః
నారదశ్చ నారాయణః

నారదుడు

నారాయణ! నారాయణ!! ఎంతమాట? ఎంతమాట?

వాల్మీకి

నిరంతరనారాయణనామపారాయణా! పూజ్యచరణా!! నారదముని ;త్తమా!!! శిష్యసమేతుడై వాల్మీకి తమకు ప్రణమిల్లుతున్నాడు. తమ ౌకచేత ఈ ఆశ్రమం పూతమైంది. మేము ధన్యులం. తమకు స్వా

హృదయపూర్వక స్వాగతం!! సుచిరాగతం!! ఇద మర్ఘ్యం, ఇదంపాద్యం, ఇద మాసనం, అనుగ్రహించండి!

నారదుడు

తపస్స్వాధ్యాయనిరతా! వాల్మీకి మునిపుంగవా!! మీలో ఒక్కడైన నాకు ఈస్వాగతోపచారా లేమిటి? అమృతహృదయుడవైన నీవు నీఅంతే వాసులతో సంతరించిన ఈ ఆతిథేయ సత్కారంతో మరేవీ సాటిరావు. మీ ప్రాతఃకాలాధ్యయనాని కాటంకం కలిగించలేదు గదా! నాయీరాక?

వాల్మీకి

ఎప్పటికీ కాదు మునీంద్రా! మీరాకచే మానిత్యవిధులు వినూత నంగా శోభిస్తాయి .. అదేమోకాని, ధన్యున్మనీ! కొంతకాలంగా నాఅంత రంగం తమ ఆగమనాన్నే అభిలషిస్తున్నది. ఆడబోయిన తీర్థమెదురైనట్లుగా అదృష్టంకొలది నే డది సంప్రాప్తించింది .

సకల మానవహృదయస్పందనాన్ని అట్టేపసిగట్టగల భిషగ్వర్యులు కదా! తమరు. ఎప్పు డేప్రదేశాన్ని ఏరీతిగా పవిత్రం చేయాలో తమకు తెలియంది కాదు.

నారదుడు

మహాతపస్వివి. వినయధురంధరుడవు. అట్లాగే అంటావు. నీవంటి ఋషిసత్తముడు కూడా మా ఆగమనాన్ని అభిలషించటం మా అదృష్టమే అనాలి.

వాల్మీకి

ఎంతతపస్సు చేసినా, ఏమోకాని మేధానిధీ! దురతిక్రమంగా కొన్ని సందేహాలు నన్ను వేధిస్తూనే వున్నాయి. మహతీమంగళవాదీ! తమ మూలాన సమాధానా లపేక్షిస్తూ ఈమధ్య కొన్నిసందేహాలు జనించాయి. తా మనుమ తిస్తే....

నారదుడు

అంతకన్నానా! ఆలస్యం దేనికి? ఆసందేహా లేమిటో ప్రకటించు. శక్తివంచన లేకుండ తీర్చడానికి యత్నిస్తాను.

వాల్మీకి

ధన్యుడ్ని, ధన్యుడ్ని! దివ్యమునిపుంగవా! ఈ ప్రకృతప్రపంచంలో గుణవంతు డెవడు? ఎవడు వీర్యవంతుడు? ధర్మజ్ఞుడెవడు? కృతజ్ఞు డెవడు? ఎవడు సత్యవాక్సంపన్నుడు? విద్వాంసుడెవడు? సమర్థుడెవడు? త్రిలోకీ! ఎవ డత్యంత ప్రియదర్శనుడు? ఆత్మవంతుడు, ద్యుతిమంతుడు ఎవడు? ఎవడు జితక్రోధుడు? ఎవ డసూయారహితుడు? ఎవడు జాత రోషుడైతే దేవతలు సైతం భయభ్రాంతు లౌతారో చెప్పండి!

ఇలాంటివ్యక్తి ఉన్నా డంటారా? మీరుచెప్తే వినాలని పరమ కౌతూహలంతో వున్నాను. అట్టి నరు డుంటే చెప్పండి గురుదేవా! మీకంటె ఇందుకు సమర్థు లన్యులెవరూ లేరు.1

నారదుడు

[తనలో] నేనేది చెప్పాలని వచ్చానో దాన్నే ఈ మహాత్ముడు ప్రశ్నిస్తున్నాడు. మౌనీంద్రుని ఉత్కంఠత చాల తీవ్రంగా వుంది. ఆదర్శ శిఖరాధిష్ఠితుడైన వ్యక్తి కోసం అన్వేషిస్తున్నా డీమహనీయుడు.

[జనాంతికంగా] సత్యాన్వేషీ! చాలచిక్కు ప్రశ్నలే వేసావు. ఇలాంటి గుణాలుగలవ్యక్తి వసుంధరలో దుర్లభుడు. అవి పరమపురుష లక్షణాలు. అయినాకొంచెం ఆలోచించనీ!2 ....ఆ: గుర్తు తగిలింది. మహర్షీ!నీవు పేర్కొన్నగుణాలే కాక సకలసద్గుణ సముపేతు డైనవ్యక్తి ఒకడున్నా డిప్పుడు. అతడు ఇక్ష్వాకువంశప్రభవుడు. 'రాముడు' అనే విశ్రుత నామ ధేయుడు. నియతాత్ముడతడు. మహావీర్యుడు, ద్యుతిమంతుడు, ధృతి మంతుడు.3

వాల్మీకి

[ఉత్కంఠతో] రాముడా! ఎంత శ్రుతిమనోహరమైననామం!! రామశబ్ద శ్రవణమాత్రం చేతనే వాగాత్రం పులకిస్తున్నది. శ్రీమన్నారాయ ణుని సహస్ర నామావళి ఈరమ్యాక్షరద్వయంలో సంపుటీకరించినట్లుంది.4 ఆ మహనీయుని కమనీయ రూపగుణాభివర్ణనం కావించి కనులకు కల్యా ణము, వీనులకు విందు చేకూర్చండి స్వామి!

నారదుడు

మునివరా! ఆరాముడు బుద్ధిమంతుడు. వాగ్మి. శ్రీమంతుడు. శత్రు నిబర్హణుడు. విపులాంసుడు. మహాబాహుడు. కంబుగ్రీవుడు. మహా హనువు. మహోరస్కుడు. మహేష్వాసుడు. గూఢజంత్రువు. అరింద ముడు. ఆజాను బాహువు. సుశిరుడు. సులలాటుడు. సువిక్రముడు. సమన్న

మవిభక్తాంగుడు. స్నిగ్ధవర్ణుడు. ప్రతాపవంతుడు. పీనవక్షుడు. విశాలాక్షుడు. లక్ష్మీసముపేతుడు. సకలశుభలక్షణ లక్షితుడు. ఒక్కమాటలో - అతడు పుంసాం మోహనరూపుడు.

వాల్మీకి

చతురవచోనిధీ! ఒక్కొక్కపదం శ్రీరాముని రూపురేఖల్ని చక్కగా చిత్రిస్తున్నది. ఆమహనీయుని అసామాన్య లక్షణాలేవో అభివర్ణించి మా కానందాన్ని చేకూర్చండి దివ్యమునీ!

నారదుడు

నీ అభిలాష, ఆసక్తి చూస్తుంటే ఎంతైనా చెప్పాలనేవుంది. తేజస్వీ! ఆరాముడు ధర్మజ్ఞుడు. సత్యసంధుడు. సకలజీవ హితరతుడు. యశస్వి. జ్ఞానసంపన్నుడు. శుచిమంతుడు. సమాధిశీలుడు. అతడు ప్రజాపతిసమానుడు. రిపునిషూదనుడు. శ్రీమంతుడు. జగద్విధాత. అతడు జీవలోకరక్షకుడు. ధర్మపరిరక్షకుడు. స్వధర్మాన్నే కాక స్వజనధర్మాన్నీ రక్షింపగల దక్షుడు. మహర్షీ! అతడు వేదవేదాంగతత్త్వజ్ఞుడు. ధనుర్వేద నిష్ణాతుడు. సర్వశాస్త్రార్థ కోవిదుడు. స్మృతిమంతుడు. ప్రతిభావంతుడు. సర్వలోకప్రియుడు. ఆదీనుడు. విచక్షణుడు. సత్పురుష సేవనీయుడు. ఆర్యుడు. శత్రుమిత్రోదాసీనులందు సమబుద్ధి. సదైకప్రియదర్శనుడు. సముద్రగంభీరుడు. హిమాద్రిధీరుడు. కౌసల్యానంద వర్ధనుడు.

తపస్వీ! శ్రీరాముడు విష్ణుసదృశు డగువీర్యుడు. సోమునివలె ప్రియదర్శనుడు.కోపం వస్తే కాలాగ్నిసదృశుడు. క్షమాగుణంలో పృథివీ సమానుడు. దానంలో ధనదతుల్యుడు.సత్యంలో ధర్మదేవత.

వాల్మీకి

వాగ్యోగీ! శ్రీరాముని రూపగుణ వర్ణనంతో అమృత సేచనం చేసారు. ఈ గుణరత్నాకరుని చరిత్ర నాకర్ణించి జన్మ తరింపచేసుకోవాలనే నాతీవ్రోత్కంఠ. తా మనుగ్రహించాలి.

నారదుడు

అంతకంటెకావలసిందేముంది? నీవంటి జిజ్ఞాసువునకు, శ్రద్ధాళువుకు చెప్తేనేగదా? కథకురక్తి, వక్తకుముక్తి. ఇటువంటి సత్యపరాక్రమ గుణ సంపన్నుడయిన జ్యేష్ఠకుమారుడ్ని, తండ్రి దశరథ మహారాజా ప్రజా శ్రేయస్సు నభిలషించి, యౌవరాజ్య పట్టాభిషిక్తుడ్ని చేయాలని ఆకాంక్షించాడు. ఆ అభిషేకసంభారాలు చూచి ప్రియసతి కైకేయి, తనకు దశరథు డిచ్చిన వరద్వయాన్ని పురస్కరించుకొని, రాముడ్ని వివాసుడ్ని చేసి తన పుత్రుడ్ని చేసి పట్టాభిషిక్తుడ్ని చేయమన్నది. సత్యవచనుడు, ధర్మపాశ బద్ధుడు అయినదశరథుడు తనప్రియసుతుడ్ని రాముడ్ని అడవులకు పంపాడు. స్నేహవినయశీలుడు, సోదరప్రేమ పాత్రుడు, సుమిత్రానంద వర్ధనుడయిన లక్ష్మణు డన్ననుసరించి తనసౌభ్రాత్రాన్ని ప్రదర్శించాడు.

వాల్మీకి

ఆహా! దివ్యమునీ! లక్ష్మణుని త్యాగం జగదాదర్శం.

నారదుడు

సత్యం. ఇంకావిను. జనకకులసంజాత, సౌందర్యవతి, శ్రీరాముని దయిత సీత—చంద్రుణ్ణి రోహిణిలాగా భర్త ననుసరించింది. పౌరజనులు, దశరథుడు చాలాదూరం రాముడ్ననుసరించి తిరిగి వచ్చారు. ధర్మాత్ముడు

రాముడు సీతాలక్ష్మణులతో గంగాకూలంలోని శృంగబేరపురంలో నిషాద పతి గుహుడ్ని కలుసుకొన్నాడు. ఆ తరువాత వారు వనం నుండి వనాన్ని అధిగమించారు. భరద్వాజుని ఆదేశంమీద చిత్రకూటాశ్రమాన్ని సుందరంగా నిర్మించుకొని దేవగంధర్వ సంకాశులుగా సుఖంగా వున్నారు. అయోధ్యలో దశరథుడు పుత్రశోకాతురుడై సుతుడ్నిగూర్చి విలపిస్తూ స్వర్గం చేరుకొన్నాడు. మహాబలుడు భరతుడు రాజ్యాధిపత్యంవహించటాని కిష్టపడక రాముడ్ని అయోధ్యకు తేవాలనే ఆగ్రహంతో అడవికి వెళ్లాడు. సత్యపరాక్రముడైన రాముడ్ని ఆర్యభావపురస్కృతుడై భరతుడిలా అర్థించాడు :

"ధర్మజ్ఞా! రామచంద్రా! అయోధ్యారాజ్యపాలన కర్తవ్వ వీవే. దయామతివై గ్రహించు! అనుగ్రహించు ప్రభూ!"

పరమోదారుడు, సుముఖుడు, మహాయశుడు రాము డాతని మాటలు ఆలకించలేదు. పిత్రాదేశానుసారం రాజ్యం భరతుడిదే అని నిశ్చయించి అతనికోర్కె మేరకు తనకు ప్రతినిధిగా పాదుకలిచ్చి నివర్తింపజేసాడు. భరతుడు నందిగ్రామంలో రామపాదుకలకు పట్టాభిషేకం చేసి పూజిస్తు, రామాగమనాన్ని నిరీక్షిస్తు, రామాజ్ఞానుసారం రాజ్యపాలనం చేసాడు.

వాల్మీకి

శ్రుతివిహారా! లక్ష్మణుని త్యాగాన్ని అతిగమించిందీభరతుని త్యాగ నిరతి. ఒకరికంటె ఘను లింకొకరు. అన్నదమ్ములంటే ఇలావుండాలి.

నారదుడు

చక్కగా గ్రహించావు. ఇంకా విను. సత్యసంధుడు, జితేంద్రియుడు, అయినరాముడు, సమీపంలోవుంటే నగరజనులు తన్ను సమీపిస్తారని, పితృవాక్యపాలనలో ఏకాగ్రచిత్తుడై దండకారణ్యం ప్రవేశించాడు. రాజీవలోచనుడు రాము డా అడవిలో ప్రవేశించి, విరాధుణ్ణి వధించాడు. శరభంగ, సుతీక్ష్ణ, అగస్త్య, సుదర్శనాది మహామునుల్ని సందర్శించాడు. అక్కడ కామరూపిణి, రాక్షసి శూర్పణఖ నివసిస్తున్నది. ఆమె రాముడ్ని కామిస్తే లక్ష్మణు డామె ముక్కుచెవులు కోసి విరూపిని చేస్తాడు. శూర్పణఖ ప్రేరణపై ఖర త్రిశరదూషణాదులు పదునాలుగు వేలమంది విజృంభిస్తే వాళ్ళను రాముడు నిశ్శేషం చేసాడు. తనజ్ఞాతి ఖరుడు, తదితర రాక్షసవర్గం వధింపబడటం శూర్పణఖవల్ల విని రావణుడు క్రోధోద్విగ్నుడైనాడు. మారీచునిసాయం అభిలషించాడు. కాలచోదితుడైన రావణుడు మారీచ ప్రబోధాన్ని అనాదరించి, అతనితో రాముని ఆశ్రమం చేరాడు. రామలక్ష్మణుల్ని దూరం కావించి, రావణుడు సీత నపహరించాడు.

వాల్మీకి

అయ్యో! సీతారాములకు వియోగం చేకూర్చి పౌలస్త్యుడు అప్రతిష్ఠపాలైనాడు, పాపం!

నారదుడు

అవునవును. [తనలో] సీతాపహరణంపట్ల మౌనిహృదయం సంచలించింది. లోలో కుములుతున్నాడు. [జనాంతికంగా] రావణుడు తనకు అడ్డంవచ్చిన జటాయువు అనేపక్షిరాజు పక్షాలు నరికి, సీతను లంకలోని అశోకవనంలో ఉంచాడు. కొనఊపిరితో వున్న జటాయువు విని

పించిన రావణ సీతాపహరణవార్త రాముడాలకించాడు. రాఘవుడు శోక సంతప్తుడైనాడు. తుది నిశ్వాసం విడిచిన జటాయువునకు శ్రీరాముని చేతి మీదుగా దహనసంస్కారం జరిగింది. వానికి ఉత్తమగతు లబ్బాయి.

వాల్మీకి

తత్త్వజ్ఞా! కన్నతండ్రి దశరథమహారాజుకు లేని అదృష్టం, ఆతని మిత్రుడు పక్షిరాజుకు పట్టటం....ఎంతటి మహాభాగ్యమో?

నారదుడు

అదే సుకృతమంటే. సీతాన్వేషణ ప్రారంభమైంది. దారిలో కబంధు డనే వికృత రాక్షసవధ జరిగింది. అతడు శబరీవృత్తాంతం చెప్పాడు. రాముడు శబరికి దర్శనమిచ్చి, ఆ సంస్కారవతి చేతిమీదుగా ఆతిథ్యం అందుకున్నాడు. పంపాతీరంలో హనుమంతుడు కలిసాడు. అతనివచనాను సారం సుగ్రీవమైత్రి సమకూరింది. సీతాపహరణవార్తవిని, అగ్నిసాక్షిగా సుగ్రీవుడు రాముడితో మైత్రిచేసుకొన్నాడు. సుగ్రీవవానర వైరం రాముడు విని వాలిని వధిస్తానని ప్రతిజ్ఞచేసాడు. తనపరాక్రమంపై సుగ్రీవుడికి సరిగా ప్రత్యయం కుదరనట్లు రాముడు గుర్తించాడు. మహాపర్వతసన్నిభ మైనదుందుభి శరీరాన్ని సుగ్రీవుడు రాముడికి చూపగానే, మహాబాహుడు! మహాబలు డిదెంతపని అని మందహాసంచేసి, పాదాంగుష్ఠంతో దశ యోజనదూరాని కాశరీరాన్ని విసిరాడు. ఇంకా పరీక్షించాడు సుగ్రీవుడు. రాముడు సప్తసాలవృక్షాన్ని, పర్వతాన్ని, పాతాళాన్ని ఒకే మహాబాణంతో భేదించాడు. అప్పటికి నమ్మకం కుదిరి అందరు కిష్కింధకు చేరారు. తరువాత వాలివధ జరిగింది. తదనంతరం సీతాన్వేషణం ఆరంభమైంది. సంపాతిఅనే గ్రద్దమాటను బట్టి హనుమంతుడు సముద్రాన్ని లీలగా

లంఘించి, రావణపాలిత మైనలంకలో అశోకవనంలో రామధ్యాన యైన సీతామహాసాధ్విని సందర్శించాడు. అభిజ్ఞను చూపి, రామవృత్తాంతాన్ని తెలిపి హనుమ సీతాదేవి నోదార్చాడు. అనంతరం కపివీరుడు రావణ సేనపతులేవురిని, మంత్రిపుత్రు లేడుగురిని, అక్షకుమారుడ్ని హతమార్చి ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రానికి కట్టుపడ్డాడు. రావణుడితోమాట్లాడి అశోకవనం కాకుండా తక్కినలంకనంతా దహించా డామారుతాత్మజుడు.

తరువాత హనుమంతుడు రాముడ్ని జేరి ప్రదక్షిణించి "చూచాను సీతను" అన్నాడు. రాముడు సుగ్రీవాదులతో మహోదధి తీరం చేరాడు. ఆదిత్యసన్నిభ శరాలతో సముద్రాన్ని శోషింప చేసాడు. సముద్రుని ప్రార్థనమీద సముద్రంపై సేతువును నిర్మించే కార్యక్రమానికి శ్రీరాముడు నళుడనే వానరశ్రేష్ఠుడ్ని నియమించాడు. రాముడు తన పరివారంతో ఆ సేతువు మీదిగా లంకను జేరాడు. యుద్ధంలో రావణుడ్ని హతమార్చాడు. తన్ను సమీపించిన సీతను "నేత్రరోగికి దీపంలాంటిదాని" వని నిందించాడు.

వాల్మీకి

అబ్బా! ఎందు కాసాధ్వి నంతపరుషంగా పలికాడు రాముడు?

నారదుడు

ఆమె మహాసాధ్వి యని నిరూపించటానికే! సీతాదేవి అమృష్యమాణ. సహించలేక జ్వలనాగ్నిలో ప్రవేశించింది. అగ్నిదేవుని వచనంమీద సీతను విగతకల్మషగా గ్రహించి శ్రీరాముడు సంప్రహృష్టుడైనాడు. సర్వదేవతలు రాముని ధర్మనిరతిని అభినందించారు. ముల్లోకాలు, దేవర్షిగణం రాముని ఉదాత్త ప్రవృత్తిని ప్రశంసించాయి. రాక్షసేంద్రుడైన విభీష

ణుడ్ని లంకారాజ్యాభిషిక్తుడ్నిగావించి, రాముడుకృతకృత్యుడైనాడు. దేవతా వరప్రభావం చేత, మృతవానరులంతా నిద్ర మేల్కొంచినట్లు లేచారు. సుహృద్వృతులైన సుగ్రీవవిభీషణాదులతో రాముడు పుష్పక విమానా రూఢుడై అయోధ్యకు పయనమైనాడు. సత్యపరాక్రముడు రాముడు భర ద్వాజాశ్రమంచేరి, హనుమంతుడ్ని భరతుని సన్నిధికి-పరిస్థితులు పరి శీలించటానికి పంపాడు. హనుమంతు డెంతకు తిరిగిరాడు. తనరాక ఆలస్యమైతే భరతుడెక్కడ అగ్నిప్రవేశం చేస్తాడో అనే ఆరాటంతో రాముడు సపరివారంగా నందిగ్రామం చేరాడు. అనఘుడు రాముడు జడలు తీయించుకొని సీతాసమేతుడై పట్టాభిషిక్తుడైనాడు. ఇందుకు ప్రజానీకం ప్రముదితమైంది.

మహర్షీ! రామరాజ్యంలో సకల ప్రజలు తుష్టులు, పుష్టులు, నిరామ యులు, రోగదుర్భిక్షభయ వివర్జితులు అయినారు. అకాలమృత్యు వాప్రాం తాల్లో తారాడదు. స్త్రీలు పతివ్రతలు. వారికి వైధవ్యం లేదు. ఇదే రామ రాజ్యం. ఆ రామరాజ్యంలో చోరభయంకాని, అగ్నిభయంకాని, జలభయం కాని, వాయుభయంకానిలేదు. ఎక్కడా కించిజ్జ్వరం కూడా తగిలేదికాదు ప్రజలకు.క్షుద్భయ మనేదే వారెరుగరు. ధనధాన్య సమృద్ధితో కృతయుగం లోని ప్రజలలాగా ప్రమోదజీవనాన్ని సాగించారు. మునివర్యా! రాముడు శతాధికంగా అశ్వమేధయాగాలు చేసి, భూరిసువర్ణాన్ని, పదివేలకోట్ల గోవుల్ని, అసంఖ్యేయధనాన్ని దానంచేసి కీర్తి నార్జించాడు. ప్రతిరాజవంశీ యుడికి కొంతరాజ్య మిచ్చి రాఘవుడు రాజవంశాల్ని వృద్ధి పొందించాడు. చతుర్వర్ణాలవారిని, వారివారి ధర్మంలో ప్రతిష్ఠితుల్ని చేసాడు. ఏకాదశవర్ష సహస్రాలు రాముడు రాజ్యమేలి వైకుంఠానికి వెళ్లాడు!

వాల్మీకి

ప్రసన్నకథాకథన విధాన విశారదా! నారదము
జాను రాగంతో రమ్యాతిరమ్య మైన రామకథా వి
బ్రహ్మానందాన్ని ప్రసాదించారు. శేముషీవిచక్షణా! రా
ఆదర్శభ్రాత, ఆదర్శప్రభువు. ఆదర్శభర్త. ఆదర్శశత్రు
ఆదర్శమైంది శ్రీరాముని చరిత్ర. అతడు మూర్తీభవిం
త్యాగం? ఏమిసహనం? ఏమిసద్భావం? ఏమిసదవగాహన
సర్వకాలాల్లో ఈమానవోత్తముడ్ని మార్గదర్శకం చేసు
మాధవు లౌతారు.

దివ్యమునీ! తాను ప్రభువైనా, సకలైశ్వర్య
సామాన్య స్థాయికి దిగి నిషాదునితోను, వానరులతోను,
సునితోను, ఆ రీతిగా క్షీరనీరన్యాయంగా కలసి మెలసి జీ
రికి సాధ్యమౌతుంనా? ఆ సరస సమరస జీవనం నన్ను
వసిష్ఠమహాముని శిష్యరికం వల్లనే ఈ అసాధారణ సమ
చక్రవర్తికి సంప్రాప్తించి ఉంటుంది. సమరస జీవనం
కొన్ని సత్యాన్ని వమ్ముచేయటంకాదు. అసత్యసాధన
పరిస్థితి నైనా జయించి కైవశం చేసుకొవాలని రాముని
స్తుంది. వాలిని, రావణుడ్ని వధించటంలో రాముడు
విజేతృశీలం నాన్యతోదర్శనీయం. ఇది బ్రహ్మర్షి విశ్వామి
చేత సమకూరింది.

ప్రతివ్యక్తి ఈద్వివిధ ప్రవృత్తుల్ని సంపాదిం
చితంగా ప్రదర్శించి జీవితసమగ్రత్వాన్ని సముపార్జించుకో
రాముని చరిత్ర ఎల్లకాలంలోకాని కందిస్తున్నదని నా అవగ

నారదుడు

సత్యదర్శివి. చక్కగా విశ్లేషించావు. నీహృత్కేదారం రామ
ామృత పరిప్లావితమైంది. నాకెంతో ఆనందంగా వుంది. సంయమివరా!
ఇంక నాకు సెలవా? చాల కార్యక్రమాలున్నాయి అవతల.

వాల్మీకి

కాలజ్ఞా! ఎవరి కార్యక్రామాలకైనా అంతరాయ మవుతుంది గాని
మకు మాత్రం కాదు. మీ అవ్యాజానురాగానికి పునఃపునః ప్రణతులు.
శిష్యులతో] బ్రహ్మచారులారా! ఈ మహావాగ్మికి, ఈవాగ్యోగి వరునకు,
ఈ వాత్సల్య రసోల్లసితమూర్తికి నాతోపాటు ప్రదక్షిణ సాష్టాంగ నమ
స్కృతు లాచరించండి! ఈతని పవిత్ర చరణాల్ని గంధపుష్పాదులతో
పూజించండి! ఈగురుదేవునకు బ్రహ్మరథం పట్టటానికి రండి! "నారదశ్చ
నారాయణః" అని ఉచ్చస్వరంతో ఉద్ఘాటించండి!

శిష్యులు

నారదశ్చ నారాయణః

నారదశ్చ నారాయణః

నారదశ్చ నారాయణః

నారదుడు

అరెరే! చాలు చాలు! నేను నిమిత్తమాత్రుణ్ణి. నాకింతగౌరవం
అనవసరం. వస్తా! సెలవు. నేను వచ్చిన పని నెరవేరినట్లే. నారాయణ!
నారాయణ!! [నారదుడు నిష్క్రమిస్తాడు.]

వాల్మీకి

శిష్యా! భరద్వాజా! మధ్యాహ్నం కావచ్చింది. బ్రహ్మస్వరూపు డయిన సూర్య భగవానుడు మహేశ్వరుడౌతున్నాడు. బ్రహ్మ మానసపుత్రుడు రామకథామృతం ప్రసాదించటం శుభోదర్కం కదూ!! మాధ్యాహ్నికస్నానార్థం తమసానదికి పోవాలి. వల్కలాలతో సిద్ధమైనావా?

భరద్వాజుడు

సంసిద్ధుడ్నెయ్యే వచ్చాను గురుదేవా! దయచేయండి!

[పక్షులకిలకిలారావాలు, వృక్షపత్రాలసవ్వడులు. ఒడలు పులకింప జేసే ప్రకృతిశోభ.]

వాల్మీకి

శిష్యా! భరద్వాజా!! ఎంతసుపరిచితమైనా ఈనాడెందుకో ఈప్రకృతి అత్యంతరమణీయంగా గోచరిస్తున్నది.

భరద్వాజుడు

ప్రకృతిలో మార్పేమీలేదు గురుదేవా! మన అంతరంగం లోని ఆహ్లాదమే ఆరీతిగా ప్రకృతిలో ప్రతిబింబిస్తుందని తామే అనేక పర్యాయాలు పేర్కొన్నారు. రామకథామృతా స్వాదనానందతరంగితమైన మీ హృదయమే ఈ ప్రకృతిలో ప్రతిబింబిస్తున్నది.

వాల్మీకి

అవునవును. భాతప్రవరా! ఆతమసానదీ జలాల్ని తిలకించు. సత్పురుషుని చిత్తంలాగా ఎంతో నిర్మలంగా రమణీయంగా వున్నాయి కదూ!

భరద్వాజుడు

అందులో ఆశ్చర్యమేముంది దేశి కోతమా? ఈ నదుల కింతటి పావిత్ర్యం, నైర్మల్యం ఎందువల్ల లభించాయో మీకు చెప్పేటంతటివాడినా? తమవంటి పుణ్యపురుషులు స్నానం చేయటం వల్లనేగదా!

వాల్మీకి

భరద్వాజా! ఈ పరిసరప్రకృతిని కొంచెం పరికించాలని ఉల్లం ఉల్లాసపడుతుంది. ఈ విశాలవృక్షచ్ఛాయలో ఒకింతతడవు విశ్రమించాలని ఉత్కంఠిస్తున్నది. ఈ భూరుహం మీది ద్విజ సంతతి చేసే అవ్యక్త మనోహర కిల కిలారావాలు, ఉత్తమద్విజలోకం చేసే వేదపారాయణం లాగా కర్ణపేయంగా వున్నాయికదా!

భరద్వాజుడు

బాలపవనాలకు నినదించే శ్రుతిమనోహర వీణాతంత్రులవలే తమ హృదయం ప్రకృతిలోని యత్కించి చైతన్యానికే ఈ నాడెందుకో పరవశిస్తున్నది. తమవంటి పచేళిమ తపస్సంపన్నులకే కాని అన్యుల కిట్టితాదాత్మ్యం అలభ్యం. [ఆశ్చర్యంతో] గురుదేవా! ఆసక్తిగా తదేకదృష్టితో తిలకిస్తున్నా రక్కడ?

వాల్మీకి

భరద్వాజా! ఆక్రౌంచమిథునాన్ని చూడు!! ఎంత ఆనందంగా కల కలారావాలు చేస్తు కామపరవశ మౌతున్నదో!! ఈ మిథునానురాగం ఎంత ప్రగాఢమో!! ఇది వియోగ అసహిష్ణమైంది.

[ఆరాటంతో] ఎవడో కిరాతుడు శరసంధానంచేసి, ప్రయోగించిన సవ్వడి వినవచ్చింది. కొంపతీసి యీమిథునం మీదనే కాదుగదా!!

[మరింత తీవ్రంగా] ఎంతఘోరం! ఎంత అన్యాయం!! ఆనిశిత నారాచం క్రౌంచాన్ని పొట్టపెట్టుకొన్నది.

భరద్వాజుడు

దయామయా!! అడుగో ఎవడో నిషాదుడు!! తమవంటి సాధు పుంగవులున్నారనియైనా సంకోచింపకుండా ఆదుర్మార్గుడింతటి హింసా కాండకు తలపడ్డాడు.

వాల్మీకి

మతిమంతుడా! ఈదారుణసంఘటనకు నాహృదయం మహోద్విగ్న మౌతున్నంది. ఆవేదన దుర్భరంగా వుంది. పాపమాక్రౌంచం గిలగిలా తన్నుకొని అసువులు కోల్పోయింది. నెత్తురు మడుగులు కట్టింది. దాని చుట్టూ తిరుగుతూ కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నది. నేనీ దారుణదృశ్యాన్నికచూడలేను. ఆకిరాతునిపై క్రోధంపెచ్చుపెరుగుతున్నది. ఇకఆగలేను. ఏడీ ఆ నిషాదుడు?

"మా నిషాద! ప్రతిష్ఠాం త్వ
మగమః శాశ్వతీః సమాః ।
యత్క్రౌంచమిథునా దేక
మవధీః కామమోహితమ్"7

భరద్వాజుడు

[సంభ్రమాశ్చర్యాలతో]గురూత్తమా! అశ్రుతపూర్వం! అమోఘం! ఈ వాక్కు అసదృశం. అనన్యసామాన్యం.

ఇది పాదబద్ధం. సమాక్షరసంఘటితం. తంత్రీలయసమన్వితం౹౹.

క్రౌంచమిథున వియోగోద్విగ్నసంజనిత మైన శోకం శ్లోకరూపాన్ని వహించింది. నిషాదదారుణ హింసాకృత్యసముద్భూత లౌకిక విషాదం, ఈ శ్లోకంతో అలౌకిక ప్రతిపత్తినే సముపార్జించుకొన్నది. ఇది ఆమ్నాయ భిన్నమైన నూతనచ్ఛందస్సుగా ఈ ఛాత్రబుద్ధికి గోచరిస్తున్నది.

[తనలో] "మానిషాదః ప్రతిష్ఠాం త్వం
అగమ శ్శాశ్వతీ స్సమాః ।
యత్క్రౌంచమిథునా దేకం
అవధీః కామమోహితమ్॥"

వాల్మీకి

శోక సంతప్త హృదయావేశంతో అతర్కితంగా నేనేమేమో పలికాను. నామీది భక్తి నీచేత ఈ రీతిగా ప్రశంసావాక్యాలు పలికిస్తున్నది. ఇంతకు ఇది శ్లోకమేనా?

భరద్వాజుడు

అందుకు సందేహమా ఆచార్యా? ఆలాపిస్తుంటే ఇందులో గేయ ధర్మం కూడా గోచరిస్తున్నది.

వాల్మీకి

[చిఱునవ్వుతో] చతురమతివే! నీ కింతటి ఛందోవిదగ్ధత వుందని నాకిన్నాళ్లుగా తెలియదు. ప్రొద్దు బాగా పైకివచ్చింది. అనుకోకుండ ఇదో సంఘటన సంభవించింది. ఇక స్నాన మాచరిస్తాను. నీవు కూడ ఉపక్ర

మించు. [తనలో] 'గంగేచయమునే చైవ' 'మానిషాదః ప్రతిష్ఠాం త్వం అగమః శాశ్వతీ స్సమాః' అయ్యో! ఇదేవిటి? 'గోదావరి సరస్వతీ....'

భరద్వాజుడు

[స్వగతం] ఆశ్చర్యం! ఆశ్చర్యం!! ఈమహర్షి స్నానాచరణ సమయంలోను 'మానిషాద' శ్లోకాన్నే మననం చేస్తున్నారు. సహచరవిరహదోదూయమాన యైన క్రౌంచి ఆక్రందనం ఈ మహనీయుని మానసాన్ని పట్టి వేధిస్తూనే వున్నది. ఇంతటి సానుతాపయోగం, అంతటి తపస్సంపన్నునకేగాని అన్యులకు సాధ్య మౌతుందా? అరెరే! ఎలావణకి పోతున్నారో గురుదేవులు!?

వాల్మీకి

[వణకుతున్న కంఠంతో] భ భ భరద్వాజా! అ అ ఆశ్రమానికి దారి చూపు. ఆ బోయవాని అకృత్యం నన్నింకా కలవరపరుస్తునే వుంది. 'మానిషాద' పంక్తులు నన్ను పట్టి వీడటంలేదు. విస్మరిద్దామని ఎంత ప్రయత్నించినా వశం కావటం లేదు.

భరద్వాజుడు

ఆశ్లోక ప్రభావం అటువంటిది! తమ సానుభూతి, సానుతాపం అమోఘశక్తి సంపన్నాలు. ఇలా నడవండి గురుదేవా! నాభుజం ఊత చేసుకోండి! అయ్యో!.... ఎలా వణకి పోతున్నదో ఒడలు. నె-మ్మ-ది. నె-మ్మ-ది. ఆప్రక్క అడుగువేయకండి! అక్క-డ కంటకా లుంటాయి.

[మనోవ్యథా సూచక నేపథ్య సంగీతం]

అమ్మయ్య! ఎట్లాగో నెమ్మదిగా ఆశ్రమం చేరుకున్నాం. ఆచార్యా! ఇక్కడ తామధిష్ఠించి మాధ్యాహ్నికాన్ని నిర్వహించండి. నేను బ్రహ్మచారులకు 'మానిషాద' శ్లోక వృత్తాంతాన్ని వివరించి వస్తాను.

[ఉచ్చస్వరంతో] సబ్రహ్మచారులారా! ఇప్పుడో అపూర్వసంఘటన సంభవించింది. కామపరవశమైన క్రౌంచపక్షిని కిరాతుడొకడు కూల్చిన దారుణదృశ్యాన్ని తిలకించి, బాధచెంది, ఉద్వేగంతో గురుదేవులు ఆ నిషాదు డ్నీరీతిగా శపించారు. 

"మానిషాద! ప్రతిష్ఠాం త్వం
అగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునాదేకం
అవధీః కామమోహితమ్॥"



ఇందులోని నాల్గు చరణాలు సమాక్షర సంఘటితాలు. ఇది మార్గ పద్ధతిలోనేం కాక దేశిపద్ధతిలో పాడు కోటానికి కూడ అనువుగా ఉన్నట్లు కనిపిస్తుంది. మీరు ప్రయోగించి చూడండి! దాని శ్లోకత్వాన్ని మీ అనుభవంలో నిరూపించండి! గురుచరణులు వ్యాకులచిత్తంతో వున్నారు. నేను వారి సన్నిధికి పోవాలి. 

వాల్మీకి

ఓం భూర్భువస్సువః మానిషాద! ప్రతిష్ఠాం త్వం.... అరెరే! తత్సవితుర్వరేణ్యం.

భరద్వాజుడు

[తనలో] గాయత్రీ మంత్రంలో కూడ 'మానిషాద' శ్లోకచరణా కలిపి చదువుతున్నారు దేశికులు.

[ఆశ్చర్యంతో] ఎందుకో నేత్రాలు ఇలా మిరుమిట్లు గొలుపు తున్నాయి? ఏదో దివ్య కాంతిపుంజం! [సంభ్రమంతో] గురుదేవా! అద్భుతం! మహాశ్చర్యం! అనిర్వచనీయమైన దివ్య తేజోరాశి మీముందు గోచరించటం లేదూ?

వాల్మీకి

ఏదీ? ఎక్కడ? ఎక్కడ?

భరద్వాజుడు

తమ ఎదుటనే స్వామీ!! ఆ తేజః పుంజంలోనుండి అధ్యాప కోత్తమా! నాలుగు మోముల వేల్పు ప్రత్యక్ష మైనారు. లేవండి! అభివాద మాచరించండి.

వాల్మీకి

ధన్యోఽస్మి! ధన్యోఽస్మి!! "మానిషాద! ప్రతిష్ఠాం త్వం అగమ శ్శాశ్వతీ స్సమాః" [తొట్రుపాటుతో] అంతేవాసులారా! నాతోపాటు ఈ చతుర్ముఖ బ్రహ్మకు సాష్టాంగ ప్రణామా లాచరించండి..... 'మా నిషాద! ప్రతిష్ఠాం త్వం'.... దేవోత్తమా! ఇదేపాద్యం, ఇదే అర్ఘ్యం. ఇది ఆసనం. ఉపవిష్టులు కండి. సర్వలోక పితామహా! సహజ శత్రుత్వం తో క్రౌంచాన్ని పట్టుకోవాలనే దుర్బుద్ధితో పాపస్వభావు డాబోయ ఎంత నింద్యమైనపని చేసాడో చూశారా? లేకపోతే ఎవ్వడైనా అకారణంగా క్రీడాపరవశమైన ఆక్రౌంచాన్నారీతిగా కూలగొడతాడా? ఆక్రౌంచిదుఃఖం నన్నింకా వేధిస్తునే వుంది.10

బ్రహ్మ

[చిఱునవ్వుతో - తనలో] ఎంత భావోద్వేగం! ఎంతటిసాను తాపం!! బ్రహ్మను నేనే స్వయంగా కనిపించినా మానిషాద శ్లోకాన్ని

తద్వృత్తాంతాన్ని విస్మరించలేకుండ ఉన్నా డీఋషిసత్తముడు. హృదయ స్పందనమంటే ఇలా ఉండాలి.

[జనాంతికంగా చిరునవ్వుతో] వాల్మీకిమహర్షీ! ఆసీనుడవుగా: నాపల్కు లాలకించు. నీముఖవినిర్గతమై ఆవృత్తమౌతున్నది ఆమానిషాద పంక్తులు శ్లోకమేసుమా?[11] నీకెందుకింత అప్రత్యయం?[12] దీనితో ప్రథమ లౌకికచ్ఛందస్సు ఆవిర్భవించింది.

నాఆజ్ఞ మీదనే సరస్వతినీలో నిహితంగా వున్న మహిత కవితా వేశాన్ని, క్రౌంచవధఆధారంగాఈ శ్లోకరూపానఆవిష్కృత మొనర్చింది.[13]

ఇది యాదృచ్ఛిక సంఘటనకాదు. నీవుకవివి. నీవు గురుపద్యవిద్య కాద్యుడవు.[14] నీ కవితావేశం ఈ శ్లోకంతోనే ఆగేదికాదు. అది మహత్తర కావ్యేతిహాససృష్టికి[15] నాందీప్రస్తావన.

ఋషిచంద్రమా! శోకభరితమయిన శ్రీరామనరోత్తమ వృత్తాంత మంతా నీవు శ్లోక రూపంలో రచించాలి.[16] అందులో అసత్యదోష ముండదు. విదితావిదితంగాఉన్న ఈవృత్తాంతాన్ని నీవులోకానికి సువిదితం చేయాలి. ధర్మాత్ముడు, గుణవంతుడు, ధీమంతుడు, ఉదారుడు నైన రామచరిత్రాన్ని బాగా గ్రహించావు కదా! నీ 'మా నిషాద' శ్లోకంలోని అంతరార్థం కూడ రామాయణ కథాసారమే సుమా?[17] అవిచ్ఛిన్నమైన ఈకవితావేశంతో, మనోహరము, పుణ్యప్రదము అయిన శ్రీరామచరిత్రను శ్లోకనిబద్ధం కావించు. నీప్రతిభాచక్షుస్సుకు ప్రతిరోధంలేదు. అది జ్యోతిర్మయ మైన ఆవిర్భూతి నందింది.

పూర్వం నన్నొక్కడ్నే 'ఆదికవి' అనేనారు. ఇపుడు నాతోపాటు నీవూ ఆదికవివౌతావు. లోకసృష్టిచేత నేను, శ్లోకసృష్టి చేత నీవు. మన

ఇద్దరికి భేదం లేశమాత్రమే.[18] రామాయణ మహేతిహాసరహస్యాలు, ఆయా పాత్రల మనోవిజ్ఞానం, నీజ్ఞాననేత్రాలకు సాక్షాత్కరిస్తాయి.

మహర్షీ! మహానదులు, మహాపర్వతాలు ఎంతకాల ముంటాయో అంతకాలం రామకథ ప్రచారంలో వుంటుంది.[19] ఆకథారచనచే నీవు ముల్లోకాల్లో శాశ్వతుడవౌతావు.[20] నీకావ్యం స్త్రీ పురుష సామాన్య జనానికే కాక ధీమాన్యులకు సైతం, నిత్యం ఉపాదేయమై, ఆనంద జీవిత యాత్రాపాథేయం కూడ అవుతుంది. కవితాహంకారం పూర్తిగా క్షీణ మైనకవివి నీవు. నీకవిత వైయక్తిక విషయదూరమై, ఇతివృత్త తాదాత్మ్యాన్నిపొంది, దేశి, మర్గోభయపద్ధతుల్లో నగరాల్లోను, జనపదాల్లోను చదువుకొన్నా, పాడుకొన్నా తుల్యానందాన్నిస్తుంది.[21] సమానంగా రాణిస్తుంది.

రామాయణ సహకారవృక్ష శాఖాపత్రాల చాటున దాగి 'రామ రామ!!' కుహూకుహూరావాలు చేసే 'కోకిలస్వామి' గా లోకం నిన్ను సదా సంభావిస్తుంది.[22]

మునివర్యా! ఒక చిన్నరహస్యం. నీవు రాముణ్ని ఆదర్శ మానవుడుగానే చిత్రింపదలచినా, అతడు వేదవేద్యుడైన పరమ పురుషుడు గదా! అతడు మానవుడుగా అవతరింపగా, వేదాలు, దుర్భరతపోవిభవాధికుడ వైన నీముఖతః రామాయణాకృతిని పొందుతాయి[23].

జానకీ రామచంద్రులు వాగర్థాలు. రామాయణం వేదోపబృంహితం. నీమాటలుమంత్రాలు. నీఫణితి మధుమయం. మార్గదర్శియైన మహర్షిగా నిన్నే చెప్పాలి[24]. ఈలోకం నీకు ఋషిగానే కాక కవిగాను ద్విధా ఋణపడి ఉంటుంది[25].

శ్రీరామాయణాన్ని వేదంవలె పారాయణం చేసినా మానవాళికి సకలాభ్యుదయాలతోపాటు నిశ్శ్రేయసం ప్రాప్తిస్తుంది. ఆధివ్యాధులతో అనేకవిధాల పీడింపబడే మానవాళికి శ్రీరామాయణం దివ్యౌషధంగా పని చేస్తుంది. రామాయణాలెన్నో రావచ్చు. అవి యేవీ శ్రీరామాయణంతో సాటిరావు. శ్రీరామాయణకావ్యావరణంలో ప్రవేశించి, తద్రామణీయకాన్ని ఆస్వాదించిన సహృదయు డెవ్వడు ఇతరకావ్య రసచర్వణం చేయలేడు సుమా!26 భారతీయ జీవనవిధానాన్ని ఈరీతిగా ప్రభావితం చేసేకావ్య మింకోటి ఉండబోదు27. ఇది కేవలం రామవృత్తాంతమే కాదు, సర్వకాలం ఇది సకలనారీలోకానికి ఆదర్శమైన సీతాదేవి మహత్తరచరిత్ర28. ఇది భూలోకపు కల్పవృక్షమే కాదు. కామధేనువు కూడా. ఇది అక్షయక్షీర సాగరం అనంతరకవులకు పరమాధార మిది29. ఎప్పటికప్పుడత్యంత నవ్యంగా రాణించే కావ్యరాజం. ఇదే సత్యం శివం సుందరం.

## వాల్మీకి

సకల భూతాంతర్గతభావభావనానిపుణా! భవిష్యద్భవితవ్యవిధాతా! బ్రహ్మదేవా! నాజీవితాన్ని చరితార్థం చేసే వాత్సల్యరసోల్లసితవాగమృతం కురిపించారు. తమ ఆజ్ఞ అనుల్లంఘనీయం. ఈ నా కవితావేశాన్ని తమ ఆదేశానుసారం ఆ లోకోత్తర ధీరోదాత్తనాయకాదర్శగుణగణ సంకీర్తనంతో అక్షయం చేయటానికే ఈక్షణంనుండి ఉద్యమిస్తాను. నాశిష్యులచే ఈశ్లోకాన్ని తిరిగి తిరిగి పఠింపజేసి, దానిశ్లోకత్వాన్ని స్థాపిస్తాను30. ఇట్టి శ్లోకపు ఒరవడితోనే సమగ్ర కావ్యరచన కుపక్రమిస్తాను31. నావిన్నప మొక్కటే- ఈజాతి నన్ను విస్మరించాలి. నే నేవిధమైన ఆరాధనాన్ని

అభిలషించను. నేను చిత్రించే రాముడ్ని నాజాతి సదా సంస్మరించాలి. ఆ మహనీయుడ్ని ఆరాధించి అతని గుణవిభూతిని యథాశక్తిని సముపార్జించుకోవాలనే నా ఉత్కంఠ.

బ్రహ్మ

తథాఽస్తు! తథాఽస్తు!! [నిష్క్రమణం]

వాల్మీకి

శిష్యా! భరద్వాజా!! అరవిందాసనుని ఆదేశానుసారం ధర్మసంహిత అయిన రామాయణాన్ని సమగ్రంగా రచించాలనే ఉత్సాహం సమధికమౌతున్నది. దర్భాసనాన్ని ఆచమనజలాన్ని ఏర్పాటు చేస్తావా?

భరద్వాజుడు

అంతా సిద్ధం చేసాను గురుదేవా! తామాసీనులై ఉపక్రమించండి!!

వాల్మీకి

[నిమీళితనేత్రుడై] అరిగో సీతారామలక్ష్మణ భరతశత్రుఘ్నులు! దశరథమహారాజు-అతని ముగ్గురు భార్యలు, వారివారి హసిత భాషిత గతి చేష్టితాలు అన్నీ ధర్మబలంతో యథాతథంగా గోచరిస్తున్నాయి. భరద్వాజా! దండకారణ్యంలో శ్రీరాముడు, సీతాలక్ష్మణులతో గావించిన సంచారమంతా సరస్వతీరమణుని అనుగ్రహంవల్ల నామనోనేత్రాల ముందే జరుగుతున్నట్లుంది. కామార్థగుణ సంపన్నము, ధర్మార్థ గుణవిస్తరము, సముద్రంవలె రత్నాఢ్యము, సర్వశ్రుతి మనోహరము, సకలగుణాభిరామము, అయిన రాముని చరిత్రలోగల సత్య శీలం, లోకప్రీతి, సౌమ్యగుణసంపత్తి అంతా దృగ్గోచర మౌతున్నది.

అవిగో, విశ్వామిత్ర సమాగమం; నానాచిత్ర కథాకథనం; ధనుర్భేదనం; జానకీవివాహం; రామరామవివాదం; పట్టాభిషేక సన్నాహాలు కైకేయీదుష్టభావన; రాఘవవివాసం; దశరథవిలాపం; పరలోకగమనం; ప్రకృతులవిషాదం;ప్రజావిసర్జనం; గంగాసంతరణం; భరద్వాజసందర్శనం; చిత్రకూట నిర్మాణం; భరతాగమనం; పితృసలిలక్రియ; పాదుకాగ్రాభిషేకం; నందిగ్రామనివాసనం; దండకారణ్య గమనం; విరాధవధ; శరభంగదర్శనం; సుతీక్ష్ణసమాగమం; అనసూయాసహాసనం; అంగరాగ సమర్పణం, శూర్పణఖాసంవాదం, విరూపకరణం; ఖరత్రిశిరస్కవధ: రావణోత్థానం; మారీచమరణం; వైదేహ్యాపహరణం; రాఘవవిలాపం; గృధ్రరాజ నిబర్హణం; కబంధదర్శనం; పంపాసరోవరసందర్శనం; శబర్యాతిథ్యం; హనుమద్దర్శనం; ఋష్యమూకాగమనం; సుగ్రీవసమాగమం ప్రత్యయోత్పాదనం: సఖ్యం; వాలిసుగ్రీవవిగ్రహం; వాలినిగ్రహం; తారావిలాపం: వర్షరాత్రనివాసనం; రాఘవసింహాగ్రహం; బలోపసంగ్రహం; అంగుళీయక ప్రదానం; ప్రాయోపవేశనం; సంపాతిదర్శనం; పర్వతారోహణం; సాగరోల్లంఘనం; మైనాకదర్శనం; లంకాప్రవేశం; సీతాదర్శనం; అభిజ్ఞాప్రదానం; రావణదర్శనం; రాక్షసీత్రిజటా స్వప్నదర్శనం; మణిప్రదానం; వృక్షభంగం; లంకా దాహాభిగర్జనం; మధువనవిధ్వంసం; రాఘవాశ్వాసనం; మణినిర్యాతనం; సముద్రసంగమం; సేతుబంధనం; సముద్రప్రతారం; లంకావరోధనం; విభీషణసంసర్గం; వధోపాయనివేదనం; కుంభకర్ణవధనం; మేఘనాథనిబర్హణం; రావణవినాశం; సీతావాప్తి; విభీషణాభిషేకం; అయోధ్యాగమనం; భరతసమాగమం; రామాభిషేకాభ్యుదయం; రామరాజ్య ప్రతిష్ఠాపనం - ఏవంవిధానేకరహస్య సంఘట్టనాదికం నామ నానేత్రాలముందు సజీవంగా మసలుతున్నాయి. వీటినన్నింటిని లోకానికి రమ్యాక్షరరూపంలో సాక్షాత్కరింపచేసాను.

భరద్వాజుడు

తమ అంతర్వీక్షణ, విశదదార్శనికత అసదృశమయినవి. 'నానృషిః కురుతే కావ్య' మనే ఆర్యోక్తి తమవల్లనే లోకరూఢమవుతుంది. ఋషిగాను కవిగాను, ద్విధా మీకు లోకం ఋణపడుతుంది. ఇది యెన్నటికీ తీరేది కాదు. తమరు చిరకాలంకావించిన తపస్సు ఈరీతిగా పచేళిమమైంది. 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ' అనే ఆర్షలక్ష్యం అందిస్తుందీ రచన. ఉన్నత గిరిసదృశులగు తమముఖతః వినిర్గత మౌతున్న ఈరామాయణ మహానది భువనత్రయాన్ని పూత మొనర్చి రామసాగరానికి గమిస్తుంది.[31]

ఉదారవృత్తుల, మధురపదంబుల
సమాస సంధుల, సమతాగుణముల
సమాక్షరమ్ముల, సరసవాక్యముల
దశశిరసునివధ దాశరథుని కథ

చాతుర్వింశతి శ్లోకసహస్రము
వచస్వియౌ ముని వచించె కావ్యము;
యశస్వి రాముని యశస్సు మించెను;
ధార్మికతేజము ధరణి విరాజిలె.[32]

భరతవాక్యము-శిష్యులందరు

మౌనిస్మృతి మందరమ్ము
మథింపంగ సముద్భూత

లక్ష్మి మహాసాధ్వి సీత;
సుగ్రీవుడు సురద్రుమము;
అంగదు డైరావతమ్ము;
లక్ష్మణుండు సుధాకరుడు;
హనుమంతుడు చింతామణి;
పౌలస్త్యుడు హాలాహలము;
అమృతమ్ము విభీషణుండు;
రామాయణ దుగ్ధసింధు
వొసగుగాక; భూరిసుఖ
శ్రేయస్సులు సకలప్రజకు. 33

రఘునాథుని చరిత్రమ్ము
శతకోటి ప్రవిస్తరము
ప్రోక్తాక్షర మేకైకము
మహాపాప నాశకరము. 34

పాపములను పోకార్చును
పుణ్యములను ప్రోదిసేయు
వేదమువలె నిత్యమ్మును
చదువ దగిన కావ్యమిదే. 35

జనతా ఘన తాపహారి
రామ చరిత మాలకింప
వేద వేదాంగములను
చదివిన ఫలితం బొదవును;

రాజ్యపదవి ప్రాప్తించును,
లాభించును ప్రతి కార్యము. 36

రామాయణ కావ్యములో
పాదమైన పదమైనను
భక్తిగలిగి వినెడివాడు
బ్రహ్మత్వము పడయగలడు. 37

"సర్వేజనా స్సుఖినోభవన్తు"

# అ థో జ్ఞా పి క లు

1) కోన్వస్మిన్ సాంప్రతం లోకే
గుణవాన్? కశ్చవీర్యవాన్?
ధర్మజ్ఞశ్చ? కృతజ్ఞశ్చ?
సత్యవాక్యో? దృఢవ్రతః?

చారిత్రేణచ కోయుక్తః?
సర్వభూతేషు కోహితః?
విద్వాన్ కః? క స్సమర్థశ్చ?
కశ్చైక ప్రియదర్శనః?

ఆత్మవాన్ కో? జితక్రోధో?
ద్యుతిమాన్ కో?ఽన సూయకః?
కస్య బిభ్యతి దేవాశ్చ
జాతరోషస్య సంయుగే? (ఇవి పదహారు ప్రశ్నలు)

ఏత దిచ్ఛా మ్యహం శ్రోతుం
పరం కౌతూహలం హి మే
మహర్షే త్వం సమర్థోఽసి
జ్ఞాతు మేవం విధం నరమ్। (బాల 1—2 నుండి 5)

2) బహవో దుర్లభాశ్చైవ
యే త్వయాకీర్తి తా గుణాః
మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా
తైర్యుక్తః శ్రూయతాం నరః। (ఇందే 7)

3) ఇక్ష్వాకు వంశ ప్రభవో
రామోనామ జనైః శ్రుతః
నియతాత్మా మహావీర్యో,
ద్యుతిమాన్, ధృతిమాన్ వశీ. (8)

4) పార్వ త్యువాచ :

కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకమ్
పఠ్యతే పండితైర్నిత్యం శ్రోతు మిచ్ఛామ్యహం ప్రభో।

ఈశ్వర ఉవాచ :

శ్రీరామ రామ రామేతి రమేరామే మనోరమే
సహస్ర నామ తత్తుల్యం రామనామ వరాననే
(శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రమ్ : 26, 27)

5) గురుదేవులు రవీంద్రులు రామాయణంపై విమర్శిస్తూ The spirit of harmony and the spirit of conquest అని సూత్రప్రాయంగా పేర్కొన్నారు. అవే ఇందుకాధారం. చూ. The Indian Inheritance Vol. I Bhavan's publication.

6) బ్రహ్మస్వరూప ముదయే, మధ్యాహ్నేతు మహేశ్వరః
అస్తకాలే స్వయం విష్ణుః, త్రిమూర్తిశ్చ దివాకరః(సూర్యాష్టకమ్)

7) బాల—ii—15 "ఓరీ కిరాతుడా! నీవు క్రౌంచ పక్షుల జంట నుండి కామ పరవశమగు పులుగును చంపావు. కనుక నీకు శాశ్వత ప్రతిష్ఠ కలుగదు. అంటే ఎక్కువ కాలం జీవించవు, మరణిస్తావని అర్థం.

నిషాద=ఓబోయవాడా!, త్వం=నీవు, శాశ్వతీః సమాః= ఎక్కువ సంవత్సరాలు, ప్రతిష్ఠాం=స్థితిని, బ్రతుకును, మా అగమః=పొందకుందువుగాక (ఎక్కువకాలంబ్రిదకవు), యత్= ఎందుకంటే, క్రౌంచమిథునాత్=క్రౌంచపక్షుల జంటనుండి, కామ మోహితం=కామంచేత పరవశమైన, ఏకం=ఒకపక్షిని (మగ), అవధీః=చంపావుగదా!

శాపవాక్కు కూడ ఎంత మృదువుగా ఉంటుందో గమనించవచ్చు

8) మూలంలో వాల్మీకి భరద్వాజునితో నిలాపలికి నట్లుంది. కాని భర ద్వాజునిచేత ఇక్కడ పలికింపబడింది.

"పాద బద్ధోఽక్షర సమ స్తంత్రీలయ సమన్వితః
శోకార్త స్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా (బాల-ii-18)

9) మ-ని-స-ద అనే రాగ సరళిలో 'మార్గ' గోచరిస్తుంది. దీన్ని ఆది తాళంలో కీర్తనలాగా రెండావృత్తాల్లో పాడవచ్చు.

10) పాపాత్మనా కృతం కష్టం వైరగ్రహణ బుద్ధినా
యస్తాదృశం చారురవం క్రౌంచ హన్యాదకారణాత్।
(బాల-ii-28)

శోచన్నేవ ముహుః క్రౌంచీ ముపశ్లోక మిమంపునః
జగావంతర్గతమనాః భూత్వా శ్లోకపరాయణః (బాల-ii-29)

11) తమువాచ తతో బ్రహ్మా, ప్రహసన్ మునిపుంగవమ్
శ్లోకఏవ త్వయా బద్ధో, నాత్రాకార్య విచారణా (బాల-ii-30)

12) ఆపరి తోషాద్విదుషాం: నసాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్
బలవదపి శిక్షితానా మాత్మ న్యప్రత్యయంచేతః
(అభిజ్ఞానశాకున్తలమ్–ప్రస్తావనా-2శ్లో)

ఇట్టి పద్ధతి వాల్మీకినుండే ఉన్నట్లు, ఆవిధంగా ఉండటం ఆరోగ్య ప్రద మని సూచితం

13) మచ్ఛందా దేవతే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ
రామస్య చరిత్రం సర్వం కురు త్వ మృషిసత్తమా।(బాల–ii–31)

14) దుర్భర తపోవిభవాధికున్ గురుపద్య విద్యకు నాద్యునం
బురుహాగర్భనిభున్ ప్రచేతస పుత్రు భక్తిదలంచుచున్।
(నన్నయ భారతావతారిక)

15) కావ్యం + ఇతిహాసం → కావ్యేతిహాసం : రామాయణం
శాస్త్రం + ఇతిహాం → శాస్త్రేతిహాసం : భారతం.

16) ధర్మాత్మనో గుణవతో లోకే రామస్య ధీమతః
వృత్తం కథయధీరస్య యథా తే నారదాచ్ఛ్రుతే (ii- 32)
నతే వాగనృతా కావ్యే కాచిదత్రభవిష్యతి
కురు రామ కథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్। (ii–35)

17) మానిషాద।=లక్ష్మీనివాసమైన ఓదేవా।, త్వం=నీవు, యత్=ఎందు చేత, క్రౌంచమిథునాత్=రాక్షస మిధునమైన రావణ మందోదరు లలో, కామమోహితం = (సీతమీది కామంతో) పరవశించిన ఏకం=ఒక్కడైన రావణుడ్ని, అవధః=చంపావో, (అందుచేత) శాశ్వతీఃసమాః - సర్వకాలం, ప్రతిష్ఠాం - మాహాత్మ్యాన్ని, అగమః= పొందుదువుగాక। ఇది రాముని పరమైన అర్థం.

రావణ పరంగాను దీనికి అర్థమిలా చెప్తారు. నిషాద!= దేవర్షిగణంతో కూడిన ముల్లోకాల్ని మిక్కిలిగా పీడించిన ఓ రావణా! క్రౌంచమిధునాత్=రాజ్యక్షయ వనవాసాది దుఃఖంచేత మిక్కిలి కృశించిన, కామమోహితం, ఏకం=సీతారామ ద్వంద్వం నుండి సీత అనే ఒకరిని, అవధీః=వధకంటె అధికమైన బాధను పొందచేసావు, అందువల్ల, ప్రతిష్ఠాం=లంకానగరంలో పుత్రపౌత్రాదులతో చిరకాలం ఉండేటట్లుగా బ్రహ్మదేవుడిచ్చిన ప్రతిష్ఠను ఇకమీదట, మాగమః=పొందకుందువుగాక. ఈవిధంగా వాలిపరంగాను అర్థం చెప్తారు. అంతేకాక వక్ష్యమాణ కావ్యార్థ సంక్షేపత కూడ దీనిలో ఉందని నిరూపించారు పండితులు. తొలిపుటల్లో సూచితం.

18) ఆదికవీ చతురాస్యౌ కమలజ వల్మీకజౌ వందే
లోక శ్లోక విధాత్రోః యయోర్భిదా లేశమాత్రేణ॥

కమలజ వల్మీకజులు ఆదికవులు. ఒకరి ముఖం నుండి వేదం, మరి ఒకరి ముఖం నుండి రామాయణం వెలువడ్డాయి. ఉభయులూ చతురాస్యులు. ఒకరు చతుర్ముఖులు. ఇంకొకరు చతుర వాక్కులు. ఒకరు లోకవిధాత, ఇంకొకరు శ్లోక విధాత. వీరి విధాతృత్వంలో లోకశ్లోకాలకు భేదం లేశ మాత్రమే. అట్టి వీరికి నమస్కరిస్తాను.

19) యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి (ii—36)

20) యావద్రామాయణ కథా త్వత్కృతా ప్రచరిష్యతి
తావ దూర్ధ్వ మధశ్చ త్వం ముల్లోకేషు నివత్స్యసి॥ (ii—37)

21) ప్రశస్యమానౌ సర్వత్ర కదాచిత్తత్ర గాయకౌ
రథ్యాసు రాజమార్గేషు దదర్శ భరతాగ్రజః (iv—23)

తతస్తుతౌ రామవచః ప్రచోదితా
వగాయతాం మార్గవిధాన సంపదా
స చాపి రామః పరిషద్గత శ్శనైః
బుభూషయాసక్తమనా బభూవ హ (v—31)

పాఠ్యే గేయేచ మధురం, ప్రమాణై స్త్రిభిరన్వితమ్
జాతిభిః సప్తభి ర్బద్ధం తంత్రీలయ సమన్వితమ్। (iv—8)

22) కూజన్తం రామరామేతి, మధురం మధురాక్షరమ్
ఆరుహ్యకవితా శాఖాం, వందేవాల్మీకి కోకిలమ్।

'ఆకులందున అణగి మణగి
కవిత కోకిల పలకవలెనోయ్
పలుకులను విని దేశమం
దభిమానములు మొలకెత్తవలెనోయ్' అన్న
గురజాడవారి గేయంలోను

'మామిడి కొమ్మమీద కలమంత్ర
పరాయణుడైన కోకిల
స్వామికిమ్రొక్కి' అన్న రాయప్రోలు వారి పద్యంలోను ఈ యభి
ప్రాయం ధ్వనిస్తుంది.

23) వేదవేద్యే పరేపుంసి, జాతే దశరథాత్మజన్
వేదః ప్రాచేతసా దాసీత్, సాక్షాద్రామాయ ణాత్మనా॥

24) మధుమయ ఫణితనాం మార్గదర్శీ మహర్షి

25) ఈ సంసార మికెన్ని జన్మలకు నేనీ మౌని వాల్మీకి భా
షాసంక్రాంత ఋణమ్ము తీర్పగలదా। సత్కావ్యనిర్మాణ రే
ఖాసామగ్రి ఋణమ్ము తీర్పగలదా। కాకుత్స్థుడౌ స్వామి గా
థాసంపన్నము భక్తి తీర్చినను ద్వైతా ద్వైత మార్గమ్ములన్॥
అన్న విశ్వనాథవారి పద్యం స్మరణీయం

26) .... the Ramayana, the grandest and most paradoxical poem in the world, which becomes unmatchably sublime, by disdaining all consistent pursuit of sublimity, supremely artistic by putting aside all conventional limitations of art; magificiently dramatic by disregarding all dramatic illusion; and uniquely epic by handling the least as well as the most epic material.

Not all the persons can enter at once into the spirit of this master piece; but those who have once done so, will never admit any person, any poem in the world as its superior. —Sri Aurobindo. Kalidasa : Book I.

27) No work of world literature has ever produced so profound an influence on the life and thought of the people as the Ramayana. – Macdonold.

28) కావ్యం రామాయణం కృత్స్నం
సీతాయా శ్చరితం మహత్ (iv–6)

29) ఆశ్చర్య మిదమాఖ్యానం మునినా సంప్రకీర్తితమ్
పరంకవీనా మాధారం సమాప్తం చ యథాక్రమమ్। (iv–21)

30) తస్య శిష్యా స్తతః సర్వేజగుః శ్లోక మిమంపునః
ముహుర్ముహుః ప్రీయమాణాః ప్రాహుశ్చ భృశవిస్మితాః।
సమాక్షరై శ్చతుర్భిర్యః పాదైర్గీతో మహర్షిణా
సోఽను వ్యాహరణాద్భూయః శ్లోకః శ్లోకత్వ మాగతః
(iii-39, 40)

31) తస్యబుద్ధిరియం జాతా వాల్మీకే ర్భావితాత్మనః
కృత్స్నం రామాయణకావ్య మీదృశైః కరవాణ్యహమ్ (iii-41)

28వ పుట 31) వాల్మీకి గిరిసంభూతా రామసాగర గామినీ
పునాతు భువనం పుణ్యా రామాయణ మహానదీ॥

32) ఉదార వృత్తార్థ పదై ర్మనోరమైః
తదాస్య రామస్య చకార కీర్తిమాన్
సమాక్షరైః శ్లోకశతై ర్యశస్వినో
యశస్కరం కావ్యముదార ధీర్మునిః। (iii-42)

తదుపగత సమాస సంధియోగం
సమమధురోప నతార్థ వాక్యబద్ధమ్
రఘువర చరితం మునిప్రణీతం
దశశిరస శ్చ వధం నిశామయధ్వం। (iii-43)

33) వాల్మీకిస్మృతి మందరేణ మథితః సీతారామాసంభవః
సుగ్రీవామర భూరుహోఽంగద గజస్సౌమిత్రి చంద్రోదయః
వాతోత్పన్న మణి ర్విభీషణసుధః పౌలస్త్య హాలాహలః
శ్రీరామాయణ దుగ్ధసింధురమలో భూయాత్సుఖః శ్రేయసే॥

34) చరితం రఘునాథస్య, శతకోటి ప్రవిస్తరం
ఏకైక మక్షరం ప్రోక్తం, మహాపాతక నాశనమ్

35) ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్
యఃపఠే ద్రామచరితం, సర్వపాపైః ప్రముచ్యతే॥ (ii—98)

36) పఠన్ద్విజో వాగృషభత్వ మీయాత్
స్యాత్ క్షత్రియో భూమి పతిత్వ మీయాత్
వణిగ్జనః పణ్యఫలత్వ మీయాత్
జనశ్చ శూద్రోఽపి మహత్వమీయాత్॥ (ii—100)

37) శృణ్వన్ రఘునాథస్య, యః పాదం పదమేవవా
సయాతి బ్రహ్మణ స్థానం, బ్రహ్మణా పూజ్యతే సదా॥



# శ్రీ మద్భాగవ తావిర్భావం

పాత్రలు :

*1*, వ్యాసుడు

*2* నారదుడు

భూషణములు వాణికి నఘ
పేషణములు, మృత్యుచిత్త భీషణములు, హృ
త్తోషణములు, కల్యాణ వి
శేషణములు, హరిగుణోపచిత భాషణముల్॥

వర గోవింద కథాసుధారస
మహావర్షోరుధారా పరం
పరలన్ గాక బుధేంద్రచంద్రు
యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహ
జనుస్సంభావితానేక దు
స్తర గంభీర కఠోర కల్మష
కనద్దావానలం బారునే॥

(శ్రీ మదాంధ్ర భాగవతం – ప్ర–13, 16)

[అది సరస్వతీ—అలకానంద నదుల పవిత్ర సంగమస్థలి—తదుత్తరంగా శమ్యాప్రాస మనే దివ్యక్షేత్రం—అందులో బదరీ తరుషండ మండితమైన బదరి కాశ్రమం—ఆ ఆశ్రమంలో వ్యాసమహర్షి — ప్రాతఃకాల సమయం.

పెనుగాలులు వీస్తున్న సవ్వడులు — బదరికావృక్ష శాఖా తీవ్ర సంచలనం]

## వ్యాసుడు

[తనలో] ఓహో! ఏమిటీ ఉల్లోల కల్లోలం? బాహ్య ప్రకృతి కనుకూలంగా నా అంతరంగం కూడ ఈనాడెందుకో తీవ్రమైన అశాంతికి లోనవుతున్నది.

అబ్బ! దుర్భర మీ శిరోవేదన!! కోటి గొడ్డళ్ళతో ఒక్కమారు కొట్టినట్లుంది.

ఏలోపంవల్ల నాకీ సంకటం సంప్రాప్తించినట్లు?

బ్రహ్మచర్య వ్రతధారినై వేదాలను, గురువుల్ని, అగ్నుల్ని పూజించాను. వారి ఆజ్ఞల్ని పాలించాను.

విహిత కర్మల్ని కొరత పడకుండా ఆచరించాను.

యజ్ఞ యాగాదులు విచ్ఛిన్నం కాకుండా ఉండటానికి, ఏకంగా ఉన్న వేదాన్ని చతుర్విధంగా వింగడించాను.

ఋగ్వేదంలో పైలుడ్ని, కవియైన జైమినిని సామ వేదంలోను, వైశంపాయనుడ్ని యజుర్వేదంలోను, సుమంతుడ్ని అథర్వణ వేదంలోను నిష్ణాతుల్ని గావించాను.

కర్మ నిర్వహణానంతరం బ్రహ్మతత్త్వ మథనానికి తోడ్పడాలని బ్రహ్మ-సూత్రాలు విరచించాను.

అంతే కాదు. ఈ వేదార్థం స్త్రీ సామాన్య జనావళికానికి కూడా అందుబాటు కావాలనే ఆరాటంతో పంచమ వేదంగా భారతేతిహాసాన్ని విరచించాను.

అయినా ఈ నా చర్యలవల్ల నాకెందుకో ఆత్మశాంతి కలగటంలేదు. ఆత్మాధిష్ఠితుడైన ఈశ్వరుడు సంతోషపడుతున్న జాడ కనిపించటం లేదు. బహుశః పరమహంసలకు, భగవంతుడికి ప్రీతిపాత్రమైన భాగవత ధర్మం చెప్పక పోవటంవల్ల ఈ న్యూనత చేకూరిందేమో! ఏమిటో!!

ఏవిధంగా ఆత్మ శాంతి సమకూరుతుంది? ఏరీతిగా ఈ శిరోవేదన సమసి పోతుంది?

[కొంతతడవు అటు ఇటు పచారులు చేసిన తరువాత సున్నితంగా విపంచికా నినాదాలు వినవస్తాయి. ప్రకృతి కొంత ప్రశాంత మౌతుంది.]

ఆశ్చర్యం! ఆశ్చర్యం! ఎక్కడివా వల్లకీ తంత్రీ నినాదాలు? ఏతద్వ్యాప్తి మాత్రం చేతనే ప్రకృతి ప్రశాంతి వహిస్తున్నది. నా అంతరంగంలోని వేదన మెల్ల మెల్లగా ఉపశమిస్తున్నది. శిరోవేదన నెమ్మది నెమ్మదిగా తిరోగమిస్తున్నది.

ఆహా! వల్లకీ వల్లభుని మధుర సంగీతం! సమయోచితంగా సమకూరి ప్రమాదస్థితి నుండి తప్పించింది.

ఆ మహామేయుని ఆనన సంభూత హరిగీతరవ సుధాధారల్ని ఆస్వాదిస్తే పూర్తిగా ఈ ఆధి వ్యాధులు ఉపశమించి తీరుతాయి.

నారదుడు

పాట :

నారాయణ నామామృత
మాస్వాదింపవె మనసా॥
జీవన్ముక్తికి సులభో
పాయమిదే ఓ మనసా॥
శేముషీ విశేష విభవ
మాత్మానంద మొసంగదు
ధర్మాచరణం బొక్కటి
సంతుష్టిని సమకూర్చదు
నోరారగ నారాయణ
నామ కీర్తనము చేసిన
వ్యక్తికె సమకూరు ముక్తి
ఆత్మానందం బొదవును॥ ॥నారా॥

వ్యాసుడు

[తనలో] మహత్తర నూతన సందేశాన్నే అందిస్తున్నదీగేయం. నన్నుద్ధరించటానికే కరుణామయుడు, దివ్యముని నారదులవారు ఆశ్రమాభిముఖులౌతున్నారు.

ఓహో! ఆ కపిల జటాభార కాంతి పుంజానికి దిశలు పశ్చిమాత దీధితి వహిస్తున్నాయి.

[ఆఘ్రాణించి] తనులగ్న తులసీకాదామ గంధం, గగనాంత రాళాన్ని కప్పివేస్తున్నది.

ప్రత్యుత్థానం చేసి, స్వాగతవాక్యాలు పలికి, చరితార్థుణ్ణి అవుతాను.

[నీరస కంఠంతో] భద్ర విమల కీర్తి పారగా! ఆరాధనయ విశారదా!! నారదమునీంద్రా!

స్వాగతం! సుస్వాగతం!!

పారాశర్యుని వినయపూర్వక ప్రణామ సహస్రమిదే! అర్ఘ్యపాద్యాదు లందుకొని నన్నాదరించండి.

నారదుడు

వినయైక విలాసా! నిగమ విభజన విద్యాజని తోల్లాసా!! భవ దుఃఖ నిరాసా!! గురుమనో వికాసా!! వ్యాసా! ఎందుకో నీ అతిథి సత్కార వాక్యాలు నీరసంగా ధ్వనిస్తున్నాయి. నీవేదో ఆవేదనా భారంతో కృంగి పోతున్నట్లు నీ ముఖకవళికలు సూచిస్తున్నాయి.

వ్యాసుడు

మీకు తెలియని రహస్యమా? దివ్యమునీంద్రా!! అనిర్వచనీయ మైన అశాంతి నన్నలము కొన్నది. ఇంతదనుక నా జీవితం సార్థకత భజించు కోలేదనే అనిపిస్తున్నది.

తమరాక నాకు నూత్న చైతన్యాన్ని ప్రసాదిస్తుందనే ప్రత్యయం గోచరిస్తున్నది.

నారదుడు

నారాయణ! నారాయణ!! ఎంతమాట! ఎంతమాట! నీయంతటి వాడనవలసినవా యివి? నీప్రజ్ఞా ప్రాభవాలు లోక విదితాలు.

సనాతన బ్రహ్మతత్త్వ నిర్దేతవు నీవు. సర్వార్థ పరి బృంహిత మైన భారత శ్రుతి విధాతవు. వేదపదార్థజాల విజ్ఞాతవు. కామముఖ్యా రిపుషట్క విజేతవు. యోగి నేతవు. వినీతుడవు. ఇంతగా కాతరుడవు కావటానికి తగిన కారణ మేమిటో?

వ్యాసుడు

నాజాడ్య మేమిటో నాకు తెలుస్తుందా! దివ్యమునీ!! నన్నుగూర్చి మీరు పల్కినపల్కులు అసత్యాలనను. అయినా నాఆత్మ ఎందుకో సంతోషించటం లేదు.

నీవు స్వయంభువుడైన బ్రహ్మకు ఆత్మజుడవు. పురాణ పురుష భజనా పరాయణుడవు.

సూర్యునివలె మూడు లోకాలు సంచరించగల సమదర్శనుడవు. యోగబల ప్రభావంతో ప్రాణవాయువు పగిది సర్వ ప్రాణుల అంతఃకరణా లలో ప్రవర్తించి సమస్త బుద్ధివృత్తుల్ని పసిగట్టగల ప్రజ్ఞాశాలివి.

నేను వేదస్నాతుడనే అయినా నాలో ఏదో న్యూనత కనిపిస్తున్నది. అదే తాము విచక్షణ చేసి చెప్పాలి. అంజలి ఘటించి అర్థిస్తున్నాను. మా పాలిటి ప్రత్యక్ష నారాయణులు మీరేకదా!!

నారదుడు

నారాయణ! నారాయణ! (తనలో) మహామేధావి. దీనుడై అర్థి స్తున్నాడు. ఇతని హృదయం పచేళితమైంది. మేధఆర్ద్రమైంది. సమున్నత

హృదయ మేధాశక్తుల సరస సమ్మేళనంతో రాజహంసలాగా విరాజిల్లు తున్నావు. భాగవత రచనకు ప్రేరేప వలసిన తరుణ మిదే; దానితోగాని ఈ మహనీయుని అవతారం సమగ్రంకాదు.

(జనాంతికంగా) ఆర్యపూజితా! పరాశరాత్మజా! నీ మనోద్వేగం నాకవగతమైంది. నీ ఈ కొంచెపాటుకు కారణం వివరిస్తాను. బాగా ఆలకించు.

అంచితమైన ధర్మసంచయాన్నంతా మహాభారతంలో సంతరించావు. ధర్మార్థకామ మోక్షాలనే అందులో ప్రధానపురుషార్థాలుగా అభివర్ణించావు. కాని భగవంతుడగు వాసుదేవుని ముఖ్యంగా కీర్తించలేదు. విష్ణుకథ లించిం చుక గానే చెప్పావు.

ధర్మాలు ప్రపంచించినంత మాత్రాన్నే ఆత్మశాంతి సమకూరదు భగవంతుని గుణ విశేషాల్ని ఎన్నిక సేయాలి.

నీ కీకొంచెపాటు శ్రీహరిని కోరి నుతింపక పోవటం చేతనే సుమా!!

హరినామస్తుతి శోభిల్లే కావ్యం సువర్ణాంభోజ హంసావళీ సురుచి భ్రాజితమైన మానససరస్సూ తో ప్రకాశిస్తుంది. శ్రీహరి నామస్తుతి విరహిత కావ్యం, విచిత్రార్థాన్విత మైనా, శ్రీకరంకాదు. అది అయోగ్య దుర్మలినవ త్కాకోల గర్తంవంటిది.

వ్యాసుడు

అయితే నాభారతం అటువంటిదనేనా తమ తాత్పర్యం?

హరి నామస్తుతి సేయనంత మూఢుడ్నా మునీంద్రా! శివ, విష్ణు సహస్ర స్తోత్రాల్ని భారతంలో నిక్షేపించాను గదా!

నారదుడు

అవునవును. ఆమాట కాదని ఎవరంటారు? లోకం వాటినెప్పుడు పారాయణం చేస్తునే ఉంటుంది. కాని అంతమాత్రం చాలదనే కదా!! అవి ఇంచించుకలో చేరుతాయి.

సమయం లభించినపుడల్లా, కాదు, కాదు, సమయం కావాలని కల్పించుకొని అయినా, పరవశించి, పరవసింపచేసే పరమేశ్వరస్తుతి పరాయణత్వం కావాలి. దీనికి పునరుక్తి దోషంలేదు. ఇదిఎంత పునరుక్తమైతే అంతగుణం.

ఆ మహేతిహాస మందుకంత అనుకూలం కాక పోవచ్చు. అందుకే నీ ఆత్మ ఆరచనతో సంతృప్తి పడటంలేదు.

మౌనీ! ఇటువంటి అసంతుష్టి ఆరోగ్యకరమైంది.

కొందరు తమ అల్పసృష్టికే అనల్పానంద భరితులౌతారు. నీవంటి మహనీయులు అనల్పంగా సృష్టించినా అల్పసంతోషాన్ని పొందరు.

మానవుడు ధర్మాన్ని రక్షిస్తే, ధర్మం అతడ్ని ఎలా సంరక్షిస్తుందో చక్కగా నిరూపించావు. ధర్మరక్షణ చేయగల దక్షత కల్గి, దాన్ని ఉపేక్షించిన వారి కేరీతిగా చేటు వాటిల్లుతుందో కూడ బాగానే విదితంచేసావు. ప్రజల్ని ధర్మపరాయణుల్ని చేయటానికి, నీమనీషా బలంతో ధర్మసమన్వయం కావించావు. ప్రశంసింప దగ్గ విషయాలే!

కాని ధర్మ పరాయణత్వంతోనే జీవుని వేదన తీరదు. ఆ
శాంతి, ఆత్మానందం లభించవు. తల్లడిల్లి ఈ ధర్మాలన్నింటిని ఆ
రించకపోయినా హరి నామామృతాన్ని ఆస్వాదించటానికి అలవా
పడాలి.

మానవుడు మర్త్యుడుగదా? మృత్యువతడ్ని ఛాయలాగా వెన్నం
ఉంటుంది. క్షణంగతించిందంటే అర్థమేమిటి? మృత్యుగహ్వరంలోకి ఉ
మిస్తున్నాడనేగా? అది తెలుసుకొని ఆరాటించే మర్త్యుడు నీభారత
వింటానికి ఉన్ముఖుడౌతాడా? ఆలోచించు.

వ్యాసుడు

అవునవును. తత్త్వవిశారదా: అందుకే గదా భగవద్గీతను భా
తానికి హృదయ స్థానంలో ఉంచాను.

మానవ తరణోపాయానికెన్ని మార్గాలున్నాయో అన్నింటిని ఆయ
మానవ సంస్కారాల కనుకూలంగా అందులో నిరూపించలేదంటారా?

నారదుడు

అంతమాట నేనంటానుటయ్యా? నీ భగవద్గీత మానవజీవితాన్ని
నియమించే 'లక్ష్మణగీత'. అందులోను నీనిశితమేధనిరూపితం. నీవన్నట్లు
అది అనేక శాస్త్రాల సంపుటి. భక్తిని కూడ శాస్త్రం కావించావు. కాని
భక్తి కళ. హృదయ ప్రధానమైంది.

ప్రజ్ఞానిధీ: ప్రవృత్తి ధర్మాలని, నివృత్తి ధర్మాలని పేర్కొని,
వాటిని నిష్కామ కర్మపరంగా సమన్వయించటానికి ప్రయత్నించావు.
కాని అది అందరకు అందుబాటులోది కాదు. మానవుడుగా అవతరించిన

భగవంతుడు దక్క, తక్కిన మానవు లెవ్వరు 'నిష్కామకర్మ' సాధించ లేరు. 'కర్మ' అనగానే దానిలో కామ వాసన కాస్తో కూస్తో ఉండి తీరుతుంది. 'నిష్కామకర్మ' కూడ ఒక రీతిగా 'కామ్య కర్మే'—అభావం కూడ భావ మౌతున్నట్లు.

కర్మైనా, జ్ఞానమైనా, హరిభక్తి లేంది శోభించవు. మేధావీ! ఒక్కమాటలో చెప్పాలంటే—భక్తివిహీనమైన జ్ఞానవాచా కర్మకౌశలాదులు అహంకార ప్రేరకాలౌతాయేగాని సార్థకాలుకావు. భక్తిభావ రంజకాలయి నప్పుడే వానికి చరితార్థత. జ్ఞాన, యోగ,కర్మ కౌశలాదులు లేక పోయినా భక్తి రాణిస్తుంది. కానిభక్తి లేనిది అవి శోభించవు.

భక్తి సంజనిత జ్ఞానం, భక్తి భరితమైన కర్మ, భక్తి యుక్తమైన యోగం రక్తిగట్టి ముక్తిని కరతలామలకం చేస్తాయి. అన్నింటికి భక్తే కేంద్రం. అందుకే కదా! తాపసులు, సాధులు, యోగులు,హరిని నిరంతరం భావిస్తారు. అశ్రాంతం కీర్తిస్తారు. జపాలు చేస్తారు. హరికథలు శ్రవణం కావిస్తారు. పరిపరి విధాలుగా ధన్యులు కావటాని కారాటిస్తారు. తత్త్వజ్ఞా!! నీవు చింతించని సంగతా యిది?

నీ భగవద్గీతలోను భక్తి ఏకదేశమే కదా! ఇంచించుకే. అది అలావుంచు.

ఇతఃపూర్వం నీవు మనీషా ప్రాబల్యంతో విరచించిన నీభారతం నిస్సందేహంగా ధర్మతత్త్వజ్ఞులకు ధర్మశాస్త్రం. అధ్యాత్మ విదులకు వేదాంతం నీతి విచక్షణులకు నీతిశాస్త్రం. కవి వృషభులకు మహాకావ్యం. లాక్షణికులకు సర్వలక్ష్య సంగ్రహం. ఐతిహాసికులకు ఇతిహాసం. పరమ

పౌరాణికులకు బహుపురాణ సముచ్చయం. కాని భక్తులకో? వాస్తవాని కట్టి వారే నీ దృష్టిలో లేరేమో! కదా!

వ్యాసుడు

యథార్థవాదీ! తమవాక్కు అమోఘం. అవితథం. వేదాంతానికి,* తదితర శాస్త్రాలకు కొన్ని యోగ్యతలు నిర్ణయించబడ్డాయి. మీరన్నట్లు భక్తి కళ కదా! కళకు యోగ్యత ఏమిటి?

నారదుడు

అయితే ప్రజలందరు భక్తులు కావాలి. అవుతున్నారా?

వ్యాసుడు

కావటం లేదు.

నారదుడు

కాబట్టి భక్తికి కూడ ఏవో కొన్ని యోగ్యతలు ఉండి తీరాలి. అయితే తక్కిన వాటికున్నంత తీవ్రంగా ఉండక పోవచ్చు. అయినా అందరు భక్తులు కాలేరు.

భగవదనుగ్రహంమీద అచంచలమైన విశ్వాసమే భక్తికి ప్రధానమైన అర్హత. ఆ అనుగ్రహంవల్ల జనన మరణ రూప సంసారం నుండి ముక్తి గలుగుతుందనే ప్రత్యయం దీనికి ప్రాణం.

---

* వివేకం, వైరాగ్యం, శమాది షట్క సంపత్తి, ముముక్షుత అనేవి యోగ్యతలు.

దుర్యోధనాదులకు పరమాత్మ స్వయంగా విశ్వరూప దర్శనం కావించినా, వారికి భగవద్విశ్వాసం కలిగిందా? నీవు నిరూపించిన విషయమే గదా! నీకు నేను చెప్పట మేమిటి?

భక్తి సులభమని భ్రాంతిపడతారు చాలమంది. తమ జ్ఞానంమీదనో తమ యోగం మీదనో అధిక విశ్వాసంతో అహంకరించేవారే అధిక సంఖ్యాకులు.

మునిసత్తమా! అందరు 'సోఽహం' అనటానికి ఆరాట పడతారే కాని దానికి ముందు 'దాసోఽహం' అనలేక పోతున్నారు.

'దాసోఽహం' 'దాసోఽహం' అని అనగా అనగా అందులో చివర శ్రుతమయ్యే 'సోఽహం' ఆర్ద్రమై ఆనందదాయక మౌతుంది.

వ్యాసుడు

అయితే భక్తి గరిష్ఠ మనేనా తమ ప్రబోధం?

నారదుడు

గరిష్ఠమా? కనిష్ఠమా? అని కాదిక్కడ విచారించ వలసింది. ఆ తారతమ్య విచక్షణవల్ల బుద్ధికేదో ఉపశమనం కలుగవచ్చు. కాని ఏది సమగ్రం? ఏది సార్థకం? ఏది సాధనం, సాధ్యం కూడ అవుతుంది? ఏది సర్వతోముఖంగా మానవ జీవితాన్ని పండిస్తుందో పరిశీలించాలి.

మానవునకు శరీరం, ఇంద్రియాలు, మనస్సు, చిత్తం, అంతఃకరణం, ఆత్మ ఇత్యాదు లున్నాయి గదా! జ్ఞానికి ఆత్మ ఒక్కదానితోనే పని. తక్కినవాటి నన్నింటిని నిరసిస్తాడు.

కాని భక్తుడు దేన్ని నిరసించడు. భగవదారామంలో అన్ని ఫలాలు ఆస్వాదనీయాలే. సమస్తం భగవత్కైంకర్యాని కుపయోగపడేవే. ఇవి తనవి కావు. భగవంతుడు తనవద్ద న్యాసం చేసినవి. తిరిగి ఆయనకే సమర్పించుకొని ధన్యుడు కావాలనే భక్తుని లక్ష్యం.

క్రమంగా మృణ్మయమైన ఇంద్రియాన్ని భగవన్నామ కీర్తనాదుల చేత చిన్మయం కావించు కొంటాడు. భగవద్గాథలే నిరంతర మాలకిస్తాడు భగవన్నామాన్నే రసనాగ్రంపై నర్తింప చేస్తాడు. భగవంతుడ్ని పూజించ టానికి, ఆయన్ని అలంకరించటానికి, నిరంతరం సేవించటానికి తన హస్తద్వయి నుపయోగిస్తాడు. భగవద్రూప దిదృక్షారతితోనే చూపుల్ని నిగిడిస్తాడు. నిఖిల రసామృతమూర్తి అయిన ఆతని పాదపద్మాల సమీ పంలోనే శిరస్సును వంచి వందిస్తాడు. నిరంతరం చిత్తాన్ని భగవదాయ త్తం చేస్తాడు.

విజ్ఞాన ఋషీ! భక్తునికి ఎవరితోను వైరుధ్యం లేదు. అంతా చిత్స్వ రూపంగానే సందర్శిస్తాడు. ప్రతి జీవిలోను ఉన్న శివుడ్ని ఆరాధిస్తాడు. ఇంతటి సరస సమరస జీవన విధానం తక్కిన ఏ పద్ధతిలోనైనా ఉన్న దంటావా? భక్తి విశ్వసమైక్య శక్తి. కడకు ముక్తి నిగూఢ తిరస్కరించే మహత్తరానురక్తి ప్రతి జీవుడిలోను నిహితంగా ఉన్న ఈ మహిత భక్తి భావాన్ని బాగా ఆవిష్కరించాలి, నీవంటి మహనీయుడు. అందుకుగాను ముందుగా తన హృదయంలోని భక్తిని ఆవిష్కరించాలి.

వ్యాసుడు

దేశికోత్తమా? నా అజ్ఞానతిమిరం పటాపంచలౌతున్నది. అనిర్వాచ నీయమైన నూతన చైతన్యం నన్నావేశిస్తున్నది. కరుణించి భక్తి

తత్త్వాన్ని మరికొంత వ్యాఖ్యానించి వీనులకు విందు చేయ వేడు కొంటున్నాను.

నారదుడు

అలా అడిగావు. బాగుంది. భక్తిని గూర్చి ఎంత చెప్పినా తరగదు అనుభవం ద్వారా గ్రహించి ఆనందించవలసిన విషయాన్ని చప్పని మాటలతో చెప్పటం తెలివి తక్కువతనం. అయినా నీ వంటి ధీశాలి అడిగితే చెప్పకుండా ఉండకూడదు.

నీ విజ్ఞత నాకు తెలియనిదికాదు. నీ అంతస్సారం నే-నెరుగంది కాదు. సారవంతమైన క్షేత్రంలో పడ్డ బీజమే ఫలవంతమౌతుంది. నీ హృదయంలో నిహితంగా ఉన్న భక్తి భావాన్ని అభివ్యక్తం చేయటమే నా కర్తవ్యం.

భగవత్పరమైన పరమ ప్రేమ భక్తి. అది అమృత స్వరూపం. అది లభించిన పురుషుడు సిద్ధుడు, అమృతుడు, తృప్తుడు, అవుతాడు.

ఆభక్తి సంప్రాప్తించిన వ్యక్తి అన్యాన్ని వాంఛింపడు. దేనికి వగవడు. దేనినీ ద్వేషింపడు. దేనియందు రమింపడు. దేనికీ ఉత్సాహ పడడు.

ఇట్టి భక్తుడు, మత్తుడు, స్తబ్ధుడు. ఆత్మారాము డవుతాడు.

ఈ పరమ ప్రేమ లౌకిక కామన వంటిది కాదు. దానికి వ్యతిరేక మైంది. లౌకిక వ్యాపారాల నన్నింటిని సన్యసిస్తేనే అది సంప్రాప్తం. అంటే త్యజించటం కాదుసుమా!! క్రియారాహిత్యం అంతకన్న కాదు. అహంకార మమకార ఫలాభి సంధి రహితంగా, భగవత్పరంగా వాటిని నిర్వహించటం.

భక్తునకంతా భగవదిచ్ఛే. తనదంటు ఏదీలేదు. ఇట్టి అనన్య భావానికి భంగకరమైన వాటిపట్ల భక్తుడుదాసీనత వహిస్తాడు. అట్లాగని భోజన భాజనాదులు విసర్జించి, తనువును కృశింప చేయడు.

భక్తుని తనువుకూడ పరమేశ్వరుడిచ్చిందేగదా! న్యాసాన్ని భద్ర పరచినట్లుగా దాన్ని తగురీతిని పరిపోషిస్తాడు. ఎందుకు? భగవత్సేవానిర్వహణానికది ప్రకృష్టోపకరణం కాబట్టి.

వ్యాసుడు

సూత్ర ప్రాయంగా భక్తిని నిరూపించారు. ఇవన్నీ నారద భక్తి సూత్రాలుగా వ్యాప్తి చెందితే లోకాని కెంతో ఉపకరిస్తాయి.

మహాత్మా! లక్షణం చెప్పారు. లక్ష్యం చెప్పలేదు.

నారదుడు

అదా! లక్ష్య చక్షుష్కృత అల్పాధికారు లపేక్షించే దంటావేమోనని చెప్పలేదు. ఇందు కతి వ్యాప్తి అవ్యాప్తి దోషరహితమైన లక్ష్యం ఒకటే. వ్రజ గోపికలు. అస్మదాదులు కూడ వారి పేరెత్తితే సిగ్గుపడాలి. నీవు నీ భగవద్గీతాంతంలో 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అన్నావు. అందులో 'వ్రజ' శబ్దం వ్రజకాంతను సూచిస్తుంది.

వ్యాసుడు

నేనంతగా ఊహించలేదు. మీముఖతః విని ఆనందిస్తున్నాను.

బృందావన గోపికలు!! దివ్యమునీ! వారిపేరు వినగానే ఒడలు పులకరిస్తున్నది. ప్రతిజీవి ఒక గోపిక కాగల్గితే, ప్రతిహృదయం దివ్య బృందావన మౌతుంది. అప్పు డీవిశ్వం బృహద్బృందావనమే.

నారదుడు

అవునవును. నీవప్పుడే భావాంబర బృందావన వీధులలో రెక్కలు గట్టుకొని విహరించే టట్లున్నావు. నీ వొక్కడివే విహరించటం కాదు. లోకాన్నంతా విహరింప జేయాలి. నాకు తెలుసు, నీకా శక్తి ఉంది. కాస్త ఓపికపట్టి ఆలకించు :

వ్యాసుడు

చెప్పండి. చెప్పండి. ఇంకా భక్తిని గూర్చి మీ ముఖతః ఎంతైనా వినాలనే ఉన్నది.

నారదుడు

జిజ్ఞాసీ! కుల ధర్మాల్ని విడనాడి ఎవడైనా భగవ త్పాదారవింద సేవాపర తంత్రుడైతే, ఈ జన్మలో కాక పోయినా, మరుజన్మలోనైనా చిత్త పరిపాకం కల్గి, తరిస్తాడు. భగవత్సేవా విరహితంగా కుల ధర్మ గౌరవాదుల కోసం ప్రాకులాడే మానవుడు ఎన్ని జన్మలెత్తినా సిద్ధి పొందలేడు.

అందుచేత ఓ మునీ! శ్రీహరి సేవ అనివార్యమైంది. సుఖదుఃఖా లెన్ని ప్రాప్తించినా హరిసేవ విడువరానిది. ఊర్ధ్వంలో బ్రహ్మ మొదలు, క్రింద స్థావర పర్యంతంగా తిరిగేజీవులకు దుఃఖాలలాగా సుఖాలు ప్రాకృత కర్మాధీనమై ప్రాప్తిస్తాయి. భక్తు డిట్టివాటిని లెక్క సేయడు. ఏది పొంద రానిదో అట్టి మేలు పొందటానికే హరిసేవ చేయాలి

హరిసేవకుడు జన్మెత్తినా అన్యునిలాగా సంసార సాగరంలో చిక్కడు. స్రుక్కడు. భక్తిరస వశవర్తియై శ్రీహరి చరణ స్మరణాన్ని ఏమరడు.

విష్ణుడు విశ్వం. విశ్వాతీతుడు. విష్ణునికంటె వేరేమీ లేదు. విశ్వానికి భవవృద్ధిలయాలు పరమేశ్వరుని వల్లనే కల్గుతాయి.

అందువల్ల ఓ మహాత్మా! అమోఘ దృగ్విలాసా! వ్యాసభగవాన్! నీవు ధీసంపన్నుడవు. సత్యనిష్ఠుడవు. నియమపరాయణుడవు. సమస్త జీవ బన్ధ విముక్తికై శ్రీహరిలీలా విశేషాల్ని సమాహిత చిత్తంతో స్మరించి అభివర్ణించు.

భగవల్లీలల్నిగాక, అన్యాభి వర్ణన రతుడు బహునామ రూపాత్మక పాశబద్ధు డౌతాడు. వాని బుద్ధి భేదభావ భరితమై వాతాహతమైన నావ లాగా అస్థిరమై గమ్యం చేరక నశిస్తుంది.

సహజంగానే విషయాసక్తుడైన మానవుడికి ధర్మంకోసం, నిందిత మైన కామ్య కర్మల్ని చేయటానికి అనుజ్ఞ నిచ్చావు. ఇదివాల అన్యాయం; నీమాట మీది ప్రత్యయంతో లోకం కామ్య కర్మాసక్త మౌతుంది. అదే పరమార్థమని తద్వ్యతిరేకమైన హితబోధ నాలకింపదు.

విచక్షణుడైన వ్యక్తి, సర్వ కర్మల్ని త్యజించి, దేశకాలాతీతుడు, సర్వాంతర్యామి యగు శ్రీహరి సేవాత్మక మైన నివృత్తి సుఖాన్ని తెలుసు కోగలుగుతాడు. కాని అవివేకి, ప్రవృత్తి స్వభావోపేతుడు తెలుసుకోలేడు. అందుచేత సర్వజ్ఞా! త్రిగుణ చాలితుడు, దేహాభిమాని అయిన మానవుడికి భగవంతుని లీలల్ని అభివర్ణించ వలసిన అవసరం ఎంతైనా ఉంది.

నీవు సామాన్యుడవుకావు. శ్రీహరి అంశరూపుడవు. జన్మరహితు డవే అయినా జగన్మంగళానికి జన్మించావు ఇది నీకు విదితమే. అన్ని అవతారాలకు మూలమైన శ్రీహరి అభ్యుదయాన్ని విశేషంగా అభివర్ణించు. ఉత్తమ శ్లోకుడైన పురుషోత్తముని గుణకీర్తన మనే పరమ ప్రయో

జన లబ్ధికేగా తపస్సు, వేదాధ్యయనం, యజ్ఞానుష్ఠానం, స్వాధ్యాయం, జ్ఞానం, దానం మొదలైన వన్నీ ఏర్పడ్డాయి. ఇవన్నీ చేయటానికి మాన వులు రానురాను శక్తిహీను లౌతారు. అలసులు, మందబుద్ధి బలులు, అల్ప తరాయువులు, ఉగ్రరోగ సంకలితుల కానున్న మానవాళి తరించాలంటే ఒక్కటే సులభోపాయం. నీవు శ్రీమద్భాగవతం రచించాలి. నీ మనీష తోపాటు నీహృదయం కూడ అందు కిప్పుడు పచేశిమమైంది. ఏత ద్రచనా ప్రచోదనానికే నా ఈ రాక, ఇంతటి ఉపోద్ఘాతం.

వ్యాసుడు

గురుదేవా! ధన్యుడ్ని. దన్యుడ్ని. ఆ వాల్మీకి మహర్షినివలె నన్ను కరుణించారు. మీ అవ్యాజవాత్సల్యానికి సదా కృతజ్ఞుడ్ని.

తమ ఆజ్ఞ అవశ్యం శిరోధార్యం. ఈ సందర్భంలో నన్నో చిన్న సందేహం వేధిస్తుంది.

నారదుడు

దేహధారి కెప్పుడు సందేహాలే! త్వరగా చెప్పు. కాలాతీత మౌ తున్నది.

వ్యాసుడు

భక్తికి పారవశ్యం ముఖ్యంకదా! అటువంటి పారవశ్యంలో హరి చరిత్రా లాపనం కావిస్తే ఎక్కడైనా అపశబ్దాలు దొర్లవచ్చు. అది భగవ దపచారమే అవుతుంది. ఏం చేయటం?

నారదుడు

తొరపాటు పడుతున్నావు. కవి శిరోమణీ! భగవత్పారవశ్యం చెందినకవి ముఖతః అపశబ్దం రానేరాదు. ఒకవేళ అది లౌకిక దృష్టిలో అపశబ్దమైనంత మాత్రాన అకలంక చరిత్రుడగు శ్రీహరి కేమాత్రం కలంకం చేకూరదు.

భక్త కవి అలౌకికుడు! లౌకిక దృష్టితో అతనికవితను సమీక్షించకూడదు.

భక్త కవియోగి ముఖవినిర్గత కవితాధార అవిచ్ఛిన్నమైంది. అతిమానసమైంది. అది సకలకళంకాల్ని క్షాళనంచేసేది. దానికి కళంకమేమిటి?

వ్యాసుడు

దేశికోత్తమా! సందేహం పటాపంచలైంది. మీ ఋణం ఎన్నటికి తీరేదికాదు. అలాగని ఎటువంటి ప్రయత్నం చేయకుండా ఉండటం అన్యాయం.

ఈ లోకానికి అందుబాటులో ఉండాలని వ్రజగోపికల్ని తాము భక్తికి ఉదాహరించారు. కాని తామే ఉత్తమ భక్తికి నిదర్శన మనిపిస్తుంది. తమ చరిత్రను కాస్త వివరించి నా భాగవత రచనకు స్ఫూర్తిని ప్రసాదించండి. ఇది నా అభ్యర్థన. దయతో కాదనకండి.

నారదుడు

భక్తి భావోల్లసిత హృదయా! నన్ను గోపికలతో పోల్చకు. వారి భక్త్యనుభూతి సమగ్రమైంది. అట్టి అనుభూతి అనన్య సాధ్యం. దాని. కదే

పాటి. గోపికాభక్తి అంటే ఏమిటో గోపికగా పుట్టినప్పుడే తెలుస్తుంది. మనం దాన్ని పూర్తిగా ఊహించలేం.

నన్ను మొగమాట పెడుతున్నావు. ఎవరిచరిత్ర వారు చెప్పుకోటం మన సంప్రదాయమా? అయినా అది నీ కేమాత్రమైన ఉపకరిస్తే సంతోషిస్తాను. సంక్షిప్తంగా చెప్తాను. విను.

వ్యాసుడు

చరితార్థుడ్ని.

నారదుడు

మహామునీ! పూర్వ కల్పంలో నేను వేదవాదుల దాసీపుత్రుడ్ని. ఆ యోగులు వర్షఋతువులో ఒకానొక ప్రదేశంలో నివాసముండి చాతుర్మాస్య* వ్రతనిష్ఠులైనారు. బాల్యంలోనే నాకు వారి సేవాభాగ్యం చేకూరింది.

నేను అన్నివిధాల బాల చాపలాన్ని, బాల క్రీడల్ని విస్మరించి, ఇంద్రియ నిగ్రహంతో అల్పభాషినై, వారి పరిచర్య చేస్తున్నాను. నా స్వభావాన్ని గమనించి, తుల్యదర్శనులగు ఆ మునులు నామీద సమధిక ప్రేమను ప్రదర్శించారు.

ఆ ద్విజోత్తముల అనుమతితో వారి ఉచ్ఛిష్టాన్నాన్ని భుజించాను. దానివల్ల విశుద్ధ చేతస్కుడ్నై, పరమేశ్వర సేవా సంసక్తుడ్నైనాను.

---

* ప్రతి సంవత్సరం, ఆషాఢ శుద్ధం మొదలు కార్తీక శుద్ధం వరకు నాలుగు నెలలపాటు చేసే ఒక యజ్ఞం.

వారు నిత్యం. మనోహరంగా పారవశ్యంతో కృష్ణకథాలాపనం కావించేవారు. వారి అనుగ్రహంతో నేను శ్రవణం చేసేవాణ్ని. ఇలా శ్రద్ధాసక్తులతో ఆలకించగా, ఆలకించగా ఉత్తమ శ్లోకుడగు శ్రీహరిపై ప్రేమ హత్తుకొన్నది.

మతిమంతుడా! ఆప్రేమవల్ల నాకు నిశ్చల బుద్ధి చేకూరింది. ఆబుద్ధి ప్రభావంతో అవిద్యా కల్పితమైన స్థూల సూక్ష్మ శరీరాన్ని సందర్శించ గల్గాను.

ఋతుద్వయకాలంలో నిత్యం, త్రికాలాలలో నిర్మలమైన హరికీర్తన శ్రవణం కావించాను. దానివల్ల రజస్తమోపహారి యైన భక్తి పట్టువడింది.

ఇంతలో దీనవాత్సల్యమూర్తులు ఆబ్రహ్మణ్యులా ప్రదేశంవదలిపోతు, అనురక్తుణ్ని, వినీతుణ్ని, దాంతుణ్ని, విశ్వాసపాత్రుణ్ని బాలుణ్ని అయిన నాకు సాక్షాద్భగవతోదితమైన ఈశ్వర రహస్యోదార జ్ఞానాన్నుపదేశించారు.

ఆ ఈశ్వర జ్ఞానప్రభావంచేత వాసుదేవుని చిచ్ఛక్తి వైభవాని గ్రహించ గల్గాను.

బ్రహ్మజ్ఞా! అది తాపత్రయాన్ని ఉపశమింప జేసేది.

"ఓం నమోభగవతే వాసుదేవాయ ధీమహి
ప్రద్యుమ్నా యానిరుద్ధాయ నమస్సంకర్షణాయచ"

అనే మంత్రంతో యజ్ఞేశ్వరుణ్ని పూజించే వ్యక్తికి సమదృష్టి సమకూరుతుంది.

నేను భగవదాజ్ఞ నిలా పాలించటం గ్రహించి కేశవుడు నాకు ఈశ్వర జ్ఞానాన్ని, ఐశ్వర్యాన్ని, తన భావరూపమైన ప్రేమభక్తిని, ప్రసాదించాడు.

ఓ మహర్షీ! నీవు ఈ మంత్రాన్ని జపించు. ప్రజానీకానికి ప్రబోధించు. తాపత్రయ పీడితులైన మానవుల్ని సంసార క్లేశంనుండి సంరక్షించే దీమంత్ర రాజ మొక్కటే సుమా!

వ్యాసుడు

మహాప్రసాదం! మీ ఆజ్ఞను తప్పక పాటించి ధన్యుడ్నవుతాను.

దేవర్షీ! రహస్యమైన భగవద్విజ్ఞానాన్ని ఉపదేశించిన పరివ్రాజకులు దూరదేశానికి వెళ్లినపుడు బాల్యావస్థలో ఉన్న మీరేం చేసారు?

జీవిత శేషాన్ని ఏరీతిగా గడిపారు? వార్ధకానంతరం ఏవిధంగా దాసీ గర్భజాతమైన దేహాన్ని త్యజించారు?

మునిశ్రేష్ఠా! కాలం సర్వవస్తువుల్ని నాశనం చేస్తుంది గదా! అట్టి యీ కాలం, మీ పూర్వ కల్పస్మృతి నెందుకు నశింపచేయలేదో ఆశ్చర్యంగా ఉంది కాస్త వివరించండి.

నారదుడు

ఆ వివరాలన్నీ కావాలంటావా? అయితే విను. నాతల్లి అబల. జ్ఞాన విహీన. పరాధీనయైన దాసి. మదేకపుత్రి. నామీదనే పాపం ఆమెకు పంచ ప్రాణాలు.

నాజనని ప్రేమపాశం నుండి విముక్తి పొందాలనే ఆకాంక్షతో పంచవర్ష ప్రాయంలోనే బ్రహ్మజ్ఞానుల పంచ నాశ్రయించాను.

ఆవుపాలు పితకటానికి బయటికి వెళ్తుంటే దీనురాలగు నాతల్లిని కాలచోదిత సర్పం త్రోవలో కాటువేసింది.

నేనామె మరణానికి దుఃఖించలేదు. సరిగదా! అది భగవదను గ్రహంగా భావించాను. ఉత్తర దిక్కుగా పయనించాను. బహు దేశాలు, జనపదాలు, పర్వతారణ్యాలు ఎన్నెన్నో చూశాను. కీకారణ్యాలు దాటాను. నదీస్నాన జలపానాదులచే మార్గశ్రమాన్ని పోగొట్టుకొనే వాడ్ని.

ఒకానొక నిర్జన వనంలో అశ్వత్థ వృక్షం క్రింద కూర్చొని ఆత్మ బుద్ధి ద్వారా అంతర్యామి యైన పరమాత్మతో ఆలోచింప సాగాను.

నా హృదయంలో శ్రీహరి వెల్లడి అయినాడు. కాని ఆయన నాకు ప్రత్యక్షం కాలేదు. భగవద్దర్శన విరహితుడ్నై విహ్వలావస్థలో వ్యాకుల చిత్తంతో మేల్కాంచాను. ఎంత యత్నించినా దర్శన భాగ్యం కలగలేదు. అసంతృప్తితో కాతరుడ్నై పడిఉన్నాను.

అప్పుడో అగోచర భగవద్వాణి, గంభీరంగా ఇలా పలికింది.

"వత్సా! నీవీజన్మలో నన్ను దర్శింపలేవు. కామాదులు నశించంది నాదర్శనం లభించదు.

నీవు చేసిన సత్పురుషసేవ స్వల్పకాలికమే అయినా నాపట్ల నీకు స్థిరబుద్ధి దాని వల్లనే ఏర్పడింది. అందుచేత ఈ నింద దాసీ గర్భజాత శరీరాన్ని వదలి నాకు పార్షదుడవు అవుతావు.

మత్పరమైన నీబుద్ధి ఎప్పటికి లుప్తంకాదు. నాకృపచేత నీకు జన్మాంతర స్మృతి భ్రష్టంకాదు!

అనంతరం నేను లజ్జావిహీనుడ్నై అనంతనామ కీర్తనంతో గుహ్యము, భద్రము నైన భగవల్లీలలు స్మరిస్తు పర్యటింపసాగాను. సకల వాంచలు విడిచి, నిరహంకారుడ్ని, మాత్సర్య రహితుడ్ని అయినాను.

ఆతరువాత మృతిచెంది భగవత్పార్షదుల కుచితమైన శరీరం ధరించాను.

కల్పావసానంలో శయనాభిలాషి యగు బ్రహ్మదేవుని శ్వాసం కుండ భగవంతుని ఉదరం ప్రవేశించాను. ఇలా వేయి మహాయుగాలు గడిచాయి. భగవంతుడు మేల్కాంచి ఈ విశ్వాన్ని సృజింప గోరాడు. అప్పుడాయన ఇంద్రియాలనుండి నేను, మరీచి మొదలైన ఋషులం ఆవిర్భవించాం. విష్ణుకృపచే బ్రహ్మచర్యా న్నవలంబిస్తు, అప్రతిహత గమనం కలవాడ్నై వైకుంఠానికి లోపల బయట తిరుగుతుంటాను.

దైవదత్తము, సర్వబ్రహ్మ విభూషితమైన ఈ వీణను శ్రుతి చేసుకొని హరికథాగానంతో త్రిలోకాలు సంచరిస్తుంటాను తెలుసుకదా!

ఇంక నాకు సెలవా! పలుకవేమయ్యా? మహానుభావా! పారాశర్యుడు భాగవతరచనా పారవశ్యంలో పడ్డాడు. నారాక ఫలించింది. ఇంక లోకానికి సకల శ్రేయాలు సమకూరుతాయి.

## భరతవాక్యం

నిగమ కల్పతరుశాఖా రసాలయము భాగవతము
గళిత దివ్యఫలరాజము; ఓ భువి భావుకులారా!
శుక ముఖమున జాలువారు రసికులార! పదేపదిగ
అమృతద్రవ సమ్మితమౌ తద్రస మాస్వాదింపుడు

అదే రక్తి! అదే ముక్తి!!
అదే భక్తి! అదే భుక్తి!!
శివ సుందర సత్యమదే!
మృత జీవనమార్గ మదే!!

# వ్యాసాగమనం

## పాత్రలు

1. అగస్త్యుడు
2. లోపాముద్ర
3. వ్యాసుడు
4. పరమేశ్వరుడు
5. పార్వతి
6. వ్యాస శిష్యులు : వైశంపాయనాదులు.

* * *

స్వాగతము, విశ్వజన మనస్తత్త్వవేత్త!
వ్యాసముని! భారత మహేతిహాస కర్త!!
నీవు నీ శిష్యతతి త్రిలింగావని పయి
యడుగిడుట నాంధ్రజాతి పుణ్యము ఫలించె॥

అగస్త్యుడు

లోపాముద్రా: అటుచూడు: ఆబిల్వవనంలో ఎందరో మహర్షులు!! బాగా సందడిగాఉంది కదూ!

వారి మధ్యలో ఉన్న ఆ మహనీయ మూర్తిని గుర్తించగలవా? ఆరుద్రాక్షమాలి కారూఢ వక్షం! ఆ ఉపవీత కృష్ణాజినోత్తరాంగం! ఆ పల్లవారుణాంచిత జటాపటలం! ఆతామ్ర పాత్రాంగుళ దర్భమూల పవిత్రం!! ఆ తరుణ కింశుకలతా దండం! ఆ సాల వృక్ష ప్రాంశుచారు దేహం!! ఎవరై యుంటారు?

లోపాముద్ర

వేరే చెప్పాలా? ప్రాణనాథా!! ఆ ప్రావృషేణ్య వినీల పాథోధర శ్యామమూర్తి మీప్రాణ మిత్రులు, పరమ భాగవతోత్తమ ప్రథమగణ్యులు విమల మాహేశ్వరాచార వీథి పథికులు; అఖిల నీవార ముష్టింపచాగ్ర గణ్యులు, పారాశర్య మునివరులు!!

ఎందుకో పూర్వమంత దార్ఢ్యంగా కనిపించటం లేదు.

అగస్త్యుడు

సరిగా చెప్పావు. ఆమహాత్ముడు శిష్యసమేతంగా కాశీలో ఉన్నాడని విన్నాం గదా! ఇంతలోనే ఇక్కడ సాక్షాత్కరించా డెందుకో! త్వరగా పోదాపద!!

ఎన్నాళ్ళయిందో ఆమహనీయుని దర్శించి? ఎన్నేళ్ళయిందో! నా బాహ్య ప్రాణాలింగన సౌఖ్యం అనుభవించి!!

[సమీపించి]

మిత్రమా! పారాశర్య మునిసత్తమా!! అత్యంత సుదినమిది. నీ దర్శన భాగ్యం చేకూరింది. క్షేమమా? నీ శిష్యవర్గం కుశలమా? నేను అగస్త్యుడ్ని! లోపాముద్రతో ప్రణమిల్లుతున్నాడు.

వ్యాసుడు

[నీరసకంఠంతో] అగస్త్య మహామునీంద్రులా! ప్రతిప్రణామాలు. పరధ్యానంలో ఉండి మిమ్మల్ని గుర్తుపట్టలేదు.

దగ్గరకురా! ఏదీ ఒక్క మారు ఆలింగనం కావించుకోనీ!! ఎన్నాళ్ళకు, ఎన్నాళ్లకు ఈ కన్నుల కానందాన్ని చేకూర్చావు?

అగస్త్యుడు

[ఆలింగన మాచరించి] [తనలో] పూర్వంలాగా లేదిప్పటి ఈ ఆలింగన సౌఖ్యం.

లోపాముద్ర

ఓహో! ఏమి? ఈ మహర్షుల నిర్నిరోధ నిర్వ్యాజ నిరంకుశ ప్రణయవైభవ సంపద సొంపు!!

వ్యాసుడు

వైశంపాయనాది శిష్యవరులారా! ఈ పుణ్యముని దంపతులకు, ఈ విభక్త పార్వతీ పరమేశ్వరులకు భక్తి వినయ పురస్సరంగా సాష్టాంగ దండ ప్రణామా లాచరించండి!

దివ్య ప్రణయ మూర్తులారా! ఈ చంద్ర కాంత శిలా వేదిక నలంకరించండి.

అగస్త్యుడు

సాత్యవతేయా! మీరీ పుణ్య సీమలోకి ఎప్పుడు ప్రవేశించారు? ఇక్కడ దేయేపుణ్యక్షేత్రాలు సందర్శించారు?

వ్యాసుడు

నిన్నగాక మొన్ననే. భువన సారమైన పీఠికా పురాన్ని, అందలి కుక్కుటేశ్వర స్వామిని, కుంతీమాధవదేవుని సందర్శించాం. పీఠికాంబకు నమస్కరించాం. ఏలేరులో హేలహేల అంటూ హాయిగా స్నానమాడాం.

ఆ తరువాత కుమారారామాన్ని చేరుకొన్నాం. దివ్యవాహిని కొమ రేటిలో తీర్థమాడాం. అక్కడి భీమేశ్వరుడికి మ్రొక్కి సర్పపురం చేరాం.

మౌనీ! సర్పపురం త్రిలింగక్షోణి వైకుంఠం. అక్కడి భావనారాయణ స్వామిని దర్శించి, కాశీవియోగ దుఃఖాన్ని కొంత అపనయించుకొన్నాం.

ఆ సర్పపురంలో శ్రీ సుదర్శన శంఖ చిహ్నాంకితంగాని గృహమే లేదు. ఊర్ధ్వపుండ్ర సంపదలేని ఫాల భాగం గల ప్రజలే లేరు. భాగవత గోష్ఠికి వెలియైన వేదికే లేదు. భావనారాయణ స్వామికన్న పరదైవం లేదు. నూటయెనిమిది తిరుపతులలో ప్రసిద్ధికెక్కిందీక్షేత్రం.

అగస్త్యుడు

[తనలో] శైవంమీద ఏదో విరక్తి కలిగినట్లుందీ వీరమాహేశ్వరుడికి. [జనాంతికంగా] ఆతరువాత............

వ్యాసుడు

మిత్రమా! అక్కడి వైష్ణవుల శనివారోత్సవం ఎంత ఆనంద
ఉందంటావు?

ఆపణ్యాలు, బూరెలు, మండెగలు, పాయసం, ఆ పాండు
మాహారం, ఆ క్రొన్నేయి, ఆ ఘనరంభాఫల ఖండ శర్కరాలు — శ
వ్రాతంతో కమ్మగా ఆరగించాం.

మహర్షీ! ఈ శైవంలో పడ్డాంకాని వైష్ణవమే రుచికర
పిస్తుంది.

అగస్త్యుడు

అవునవును. ప్రయాణాలలో ఉపవాసాలు చేసి చేసి, శుష్కిం
నీ జిహ్వకు ఒక్కమారు ఇన్ని పదార్థాలు లభిస్తే అలాగే ఉంటుంది.

నీ పిచ్చిగాని, కాశీలో అన్నపూర్ణాదేవి సంపూర్ణ మాతృ హృ
యంతో మధ్యాహ్న సమయాలలో ఆప్యాయంగా బంగారు తెడ్డుతో
ాయసం కన్న ఇవి మిన్న అంటావా? కాశీలో నిత్యం ఆ పాయసా
ంచి చూడలేదా?

వ్యాసుడు

అవునవును. ఆరుచి ఎవరో కొందరు మహనీయులకే తెలుస్తుం

సర్పపురానంతరం ఈ తుల్య భాగా తీరానికి చేరాం.

ఈ జ్యోతిర్లింగానికి అభిషేకం చేసుకోని, బిల్వపూజ కావించుక
ఈ వనంలో విశ్రమించామో లేదో! అపర పార్వతీపరమేశ్వరులు
సాక్షాత్కరించారు.

అగస్త్యుడు

కృష్ణద్వైపాయనా, వచ్చినప్పటి నుండి అడుగుదామని అనుకొంటు న్నాను. ఎందుకో నీ ఆననంలో వైవర్ణ్యం అగ్గలించింది. కన్నుగవలో దైన్యం కనిపిస్తున్నది. ఆర్తి ఏదో నీ అంతరంగంలో అలము కొన్నట్లు వుంది. పూర్వం వ్యాసుడవు కావు నీవిప్పుడు.

నీవు నీ శిష్య వర్గంతో తీర్థయాత్రలు ముగించుకొని కాశీ చేరావని విని మేమిద్దరం ఎంతో సంతోషించాం.

అవునుగాని, నీవు కాశీనగరాన్ని ఎందుకు వదలి వచ్చినట్లు? లోలా ర్కుడికి, నీకుఏమైన మాటమాట వచ్చిందా? ఆ డుంఠివిఘ్నేశ్వరస్వామి నిన్నేమైనా ధిక్కరించాడా?

ఆకొన్న నిన్ను, మధ్యాహ్న వేళల్లో అన్నపూర్ణాదేవి సరిగా ఆద రించలేదా? కాలభైరవుడేమైనా నీపట్ల పాటి తప్పాడా?

ఆహా! ఆ గాంగ సైకత ప్రదేశాల్ని, ఆ అవిముక్త హట్ట భూమిని ఆ ఏను క్రోసుల మహానగరాన్ని, ఆ మహనీయ దయామయ మూర్తి విశ్వేశ్వరుడ్ని వదలి నీకేవిధంగా రాబుద్ధి పుట్టింది?

లోపాముద్ర

ప్రాణేశ్వరా! నా విషయమే మీకు జ్ఞాపకం లేదా?

అగస్త్యుడు

అవునవును. మరచాను. లీలావనాంతంలో మా లోపాముద్ర పెట్టిన మల్లీ వల్లులు, కాశీనందన కంతే కాలుర శిరస్సులకు విరులు కల్పి స్తున్నాయా? అవి అడగమంటావు, అంతేనా?

వ్యాసుడు

[తనలో] ఈ ప్రశ్న మరీ లజ్జ పుట్టిస్తున్నది.

అగస్త్యుడు

కాశిని వదలిపెట్టి రావటమంటే గొప్పశాపమే. ఆ త్రివేణి వలనం, ఆబాహ్య కక్ష్యస్థలం, ఆమధ్యాంతర కక్ష దివ్యజ్యోతి రుజ్జృంభణ, శ్రీమద్విశ్వ పతీశ లింగం, సుహృద్వరా! కాశీమహాగ్రామం ఇప్పటికీ నా కన్నుగవకు న్నదయ్యా!

అర్ధరాత్రి సమయాల్లో, చంద్రాలోకం కాస్తుంటే, వేదికా స్థలాల్లో, మేనులు పులకించే టట్లుగా, దిక్కులు పి ఆతరుణేందు శేఖరుడ్ని గూర్చి గొంతెత్తి పాటలు పాడే వా

సర్వజ్ఞా! కాశీపట్టణ వియోగాని పరమ మూఢుడు చడు గదా! నీకేవిధంగా దాన్ని వదలిరా బుద్ధిపుట్టిందో! అ తున్నాను.

మాకంటే ఎలాగో తప్పలేదు.

వ్యాసుడు

[దీనంగా] తాపసి కోత్తమా! నాతెలివి తక్కువత కారణం. అన్యమేమికాదు. ఎవరినీ ఏమీ నిందించగూడదు.

కూరిమి నెచ్చెలీ! కుంభసంభవా? ఎంతో భక్తి భా దమాది సద్గుణ సముపేతమైన శిష్యసమూహంతో కాశీనగ

శించాను. అడుగు పెట్టిన ముహూర్త మెటువంటిదో! ఏమి శకునమో! తెలేదుకాని, ఎవ్వరు పొందని, పొందగూడని అవమానం పొంది, ఈ రీతిగా దక్షిణాభిముఖుడ్ని అయినాను.

అగస్త్యుడు

పంచమవేద నిర్మాతవు, బహుముఖపురాణ ప్రవక్తవు, నీకు అవమానమా?

వ్యాసుడు

నాకే అవమానం. కాశిలో కాలుపెట్టగానే, మన ధర్మాన్ననుసరించి భిక్షాపాత్రలు పట్టుకొని తలో వీధికి వెళ్లాం. ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు, ఆరు, ఏడు దినాలు—ఒక్క తల్లి గుప్పెడు మెతుకులు పెట్టిన పుణ్యాన పోలేదు. ఎనిమిదోనాటి సంఘటన యిది :

* * * * *

వ్యాసుడు : భవతి భిక్షాం దేహి!

ఒకతె : లేదు, లేదు

వ్యాసుడు : (తీవ్రంగా) భవతి భిక్షాం దేహి!!

ఇంకొకతె : నడవండి, నడవండి.

వ్యాసుడు (తీవ్రతరంగా) భవతి భిక్షాం దేహి!

మరొకతె : పొండి, పొండి

వ్యాసుడు : (తీవ్రతమంగా) భవతి భిక్షాం దేహిః

ఇంకొకతె : నిషేధం, నిషేధం.

* * * * *

కుంభ సంభవాః నా క్రోధం కట్లు తెంచుకొని ఉరికింది. కటకాలది రాయి. భ్రుకుటి నిటలం మీద చెమటలు క్రమ్మాయి.

కోపావేశంతో పళ్ళుపటపట కొరికాను। కుక్షిప్రోద్భవ నిష్ఠుర క్షుధిత దుశ్శోకాంధకారంవల్ల చక్షులు చిమ్మ చీకట్లు క్రమ్మాయి. ఉద్రేకంతో హట్టం కావించాను. పాడు భిక్షాపాత్రను పటాపంచలయ్యేటట్లు నేలకేసి కొట్టాను.

నేనేమి చేసానో అని నాశిష్య వర్గం 'మునికుంజర! కోప ముప సంహరించండి" అని లలాటాంజలి ఘటించి ప్రార్థించింది. అయినా సరకు చేయలేదు. నాప్రజ్ఞావిభవమంతా పాడయిపోయింది. ఎన్నడు లేని నైచ్యం నన్నావహించింది.

ఇది నాదుఃస్థితి అని ఇందురేఖా మౌళికి విన్నవించుకోవాలాః గంగమ్మకు అంగలార్చాలాః డుంఠి విఘ్నేశ్వరుడికి మొరపెట్టుకోవాలాః శ్రీకాకళా శూన్యుడు కాలభైరవుడ్ని కనికరించమని కాంక్షించాలాః

వీళ్ళతో నాకేంపని అని విర్రవీగాను. నన్ను నా శిష్యసంతతిని ఆదరించలేని కాశిని నేను గౌరవించట మేమటిః శపించి తీరాలనే తీర్మా నించు కొన్నాను.

మాభూత్ త్రైపురుషీ విద్యా
మాభూత్ త్రైపురుషం ధనమ్
మాభూత్ త్రైపురుషీ భక్తిః
కాశ్యాం నివసతాం సదా" అని

శపించటానికి శాపజలం అందుకోబోతే, చిత్రమేమిటో కేలు ముందుకు సాగలేదు. పేదవానికోపం పెదవికి చేటన్నట్లైంది.

అగస్త్యుడు

ఎంత సాహసానికి ఒడికట్టావయ్యా! శివుడాజ్ఞ లేంది చీమైనా కుడుతుందా? అయినా నీవంటి సత్పురుషుని మనసు గాయపడి, లోలోపల అనుకున్నా అది తగిలి తీరుతుంది. తరువాత, తరువాత

వ్యాసుడు

సంయమీశ్వరా! అప్పుడు కాశికా నగర సోమవీథికా భవన వాటికా మధ్యంలోని ఒక ఇంటి మచ్చెకంటి యాభై ఏండ్ల ప్రాయం, పండిపోయిన జుట్టు–కంకణ ఝణ ఝణత్కారం ప్రతిధ్వనించేటట్లు గోపుర ద్వారం బోరు తలుపు హాయ తట్టింది. అందియల రవళితో గూడిన మట్టియల మ్రోత మిన్ను ముట్టేటట్లుగా చరణ పల్లవాన్ని చాచి, వీణానిక్వణం లాంటి కంఠస్వరంతో

"బ్రాహ్మణోత్తమా! శాపం ఉపసంహరించుకోని ఇటు రమ్మని" ఆప్యాయంగా చేర బిల్చింది.

ఆ పిలుపు నన్నొక్కమారు శాంతింప చేసింది. ఒడలు పులకించింది. శాపజలం పారజల్లాను. అవృద్ధ సీమంతిని శుద్ధాంతాన్ని నెమ్మదిగా చేరుకున్నాను.

ఆ మహాజనని ఉపనిషదర్థం రూపుదాల్చినట్లున్నది. ఆమెకు చేమొ త్తి నమస్కరించాను. అప్పు డామె నాతో ఇలా ప్రసంగించింది. ఆమె ఒక్కొక్కమాట, ఒక్కొక్క వాడి అమ్ములాగా నాగుండెకు పొడుచుకొన్నది. ఆమె మాట్లాడు తుంది. ఆలకించు.

* * *

## అన్నపూర్ణ

మునీశ్వరా! భిక్షలభించలేదని కాశికా పట్టణం మీద అంతగా పట్టరానంత కోపాన్ని ప్రకటిస్తారా? కాశిలో భిక్షకు కొదవా? కాశికావడి పట్టుకొన్న వాళ్లకే ఈ ఆరక్షభూమిలో కావలసినంత అన్నం లభిస్తుంది గదా! ఎంత మంది అలా హాయిగా కాశిపేరు చెప్పుకొని బ్రతకటం లేదు? నీకెందుకు అన్నం లభించనట్లు? అందులో ఏదోరహస్యం ఉండిఉంటుంది. ఏ మనశ్శుద్ధి పరీక్షించటానికే నీలకంఠు డిలా చేసాడేమో?

నన్ను పరీక్షించేదేమిటని నీవు అహంకరించి ఉంటావు. అంతేనా? మనం ఎంతో గొప్పవాళ్ళ మనుకొంటాం. కాని ఆసర్వజ్ఞుని దృష్టిలో చాల చిన్న వాళ్ళం అన్నసంగతి గుర్తించం, సరే పోనీ.

నిత్యం మధ్యాహ్న వేళల్లో ఈ కాశీనగరంలో, అన్నాపూర్ణాదేవి అభ్యాగతుల కందరకు ఆప్యాయంగా అమృత పాయసాన్ని అందిస్తుందనే సంగతికూడ నీకు తెలేదా? తెలిసీ అమ్మనడిగేదేమని అనుకొన్నావా? అమ్మ నన్నం అడగటంలోకూడ అభిమాన పడతారా?

సంయమీ! ఏడు దినాలు అన్నానికి ఎద్దెంపుడితే ఈరీతిగా ఏడుస్తారా? నీ ధీరత్వం ఏమైనట్లు?

కాశీ!! ఏదో సామాన్య నగరం అని అనుకోని ఉంటావు. ఆమె శివుని భార్యని తెలియదా? పుణ్యరాశి అని గుర్తించ లేదా? కంఠం వరకు పెచ్చు లెచ్చిన కోపంతో ఆమెకే గాడు పెట్టాలనుకొన్న నీ మూర్ఖత్వం జాలి కొలుపుతుంది.

ఇప్పటికైనా తెలుసుకో. క్రొన్నెల పూవు దాల్పుకు ఆమె కూరిమి భోగ పురంధ్రి. ఆ నగరీలలామంపై ఇంత మాత్రాని కింతటి కోపం ప్రకటించడం ఎంతటి ప్రమాదానికి దారితీస్తుందో! తెలిస్తే కంపించి పోతావు. 'బుభుక్షితః కింనకరోతి పాపమ'నే నీతి ఎవరో సామాన్యుల కనుకొన్నాను. నీవంటి ధీమాన్యులకు కూడా సమానంగా అన్వయిస్తుందనుకోలేదు.

ఈపాటికే ఈ విషయం ఇందు మౌళికి తెలిసే ఉంటుంది. ఎంతగా కోపగించు కొంటాడో ఏమో!

అయినా ఇప్పుడేం చేస్తాం? కాలు జారినా తీసుకోవచ్చుకాని, పెదవి జారితే తీసుకోలేంగదా!

ఆకలిగొన్న నీతో ఇంత సేపు ప్రసంగించటం భావ్యంగాదు ఏదో తల్లిప్రేమ దాచుకోలేక మాట్లాడాను. ఏమి అనుకోవాకు.

ఆదీకాశ విప్రుడవు. నీలో నేరం వెదకటం ఉచితంగాదు.

ఇన్నిమాట లెందుకు గాని విప్రోత్తమా!! మా ఇంటి కతిథివై భిక్షస్వీకరించు. ఆలస్యం లేదు.

వ్యాసుడు

తల్లీ! ఇన్ని దినాల కెంతటిచల్లటిమాట వినిపించావు! ఈ ఒక్క మాటకు నా ఉల్లం ఉప్పొంగు తున్నది.

చిన్న సందేహం. వెల్లిగా ఆకొనిఉన్న కారణంగా నేనొక్కడ్నే భిక్షకురానా? నా శిష్యకోటిని గూడ తీసుకొని రమ్మంటవా? ఏర్పాటు ఏరీతిగా ఉన్నదో అని అడుగుతున్నాను. మొగమాట మేమిలేదు. లేదా! ఉన్న పదార్థలే అందరం సర్దుకొంటాం.

అన్నపూర్ణ

[చిరునవ్వుతో] అదా నీ సందేహం!! బలేవాడివే!! బిడ్డను తల్లి నుండి, శిష్యసంతతిని గురువు నుండి వేరుచేసే టంత అవివేకురాలనా?

నీవు అంటే నీ అంతేవాసులుకూడా! అందరు భిక్షకురండి. త్వరగా మధ్యాహ్నభిషేకాలు జాహ్నవిలో పూర్తి చేసుకోండి. ఇంతలో అంతర్గేహంలో మీ అందరికి ఇష్టమైన పదార్థాలు ఆయత్తం చేస్తాను.

వ్యాసుడు

చల్లని తల్లివి! వేయికాలలపాటు వర్ధిల్లు.

* * *, *

అగస్త్యుడు

కథ చాలా బాగుంది. రక్తి గడుతున్నది. తరువాత, తరువాత ....

## వ్యాసుడు

మున్నూరు శిష్యులు, నేను గబగబా గంగాస్నాన మాచరించి. ఉభయ పవిత్రాలు ధరించి వేదం పఠిస్తు మాతృదేవి మందిరం మొగ సాలలో కూర్చున్నాం.

మా సిరస కంఠధ్వను లాలకించి ఆ జనని బంగారు గొడుగు పాపల గిలకల గులకరింపులతో సుందరాంగి కై దండతో అడుగులు వేసు కొంటు వచ్చి. "రండి, రండి, విచ్చేయండి" అని చతుశ్శాల భోజన మందిరంలోకి తీసుకు వెళ్లింది. అక్కడమమ్మల్ని వృద్ధానుపూర్వకంగా ఆసీనుల్ని చేసింది.

ఆ చతుశ్శాలా సౌందర్యం వర్ణనాతీతం. చంద్రికా సంకాశ కౌశేయ సంధానిత వితానంతో అది శరత్కాల విహాయస వీధినే మరిపించింది.

కాలాగురు ధూప ధూమ వాసనలను బట్టి పుష్పభరిత నందన నోద్యానమే అక్కడ వెల్లివిరిసిన ట్లనిపించింది. ఆ కర్పూర విచిత్ర రంగ వల్లుల్ని తిలకిస్తుంటే. అమృతపు వాకలే ప్రవహిస్తున్నట్లు భావించాం.

అంతలో దివ్యపురంధ్రులు త్వరత్వరగా మొగివిరిసి, కరకుకూడని లేచిగు రరటాకులు పరచారు.

ఆ సాధ్వీమణి, పంక్తి పంక్తి మధ్యకి తిరిగి గంధ పుష్పాక్షతలతో అందరిని అర్చించింది. ధూపమిచ్చింది. కప్పురం నివాళించింది అనం తరం ఈ రీతిగా ఆదేశించింది:

"మీరంతా శాంతి పఠించండి. అర్ధేందు కళా కిరీటునకు మజ్జన మాచరించండి. ఈ అమృతాన్నం. ఈ పదార్థాలు మందగతిలో భుజిం

చండి కాశికాపురీమందిర విశ్వనాథుడు ఉమాపతి ప్రీతి వహించేటట్లుగా విందారగించండి"

చిత్రమేమిటంటే—వడ్డన జరగనేలేదు. ఆపోశన మెత్తమంటుంది. అంతా మాయంగా తోచింది.

వండిన పొప్పే కనిపించదు. పొగపు వాసనలేదు. పొగపోయే మార్గమే శూన్యం. భాండ సమృద్ధి, పాన విభూతి సర్వమంగళం.

ఆలోచిస్తే ఈ అండజయాన రిత్తగా ప్రియవాక్యాలు పలికిందేమో అనే సందేహం కూడ జనించింది. కాని మళ్ళీ మనస్సు అందుకు సమ్మతించలేదు. ఆ చల్లని దృష్టి, ఆ ప్రసాదం, ఆ మాధుర్యం, ఆ వివేకం, ఆ వెల్లదనం, మౌగ్ధ్యం, నిర్మలినత్వం, పరికిస్తుంటే, కల్లదనాని కేమాత్రం అవకాశం లేదు.

ఓగిరం, శాక పాకాలు లేని ఆ అరటాకు వంక చూస్తుంటే, గుండె ఝల్లుమన్నది.

ఇంతలో పాత్ర శుద్ధికి ఆజ్యం అంటించారు — ఒయ్యారంగా ఉవిదలు కొందరు. కాని వడ్డన కొనసాగలేదు. ఆ నాడు కూడా మాకు చందమామ ఘుటికే అనిపించింది. ఇంత కలాపం జరిగిన తరువాత వట్టినే పోతుందా అని నన్ను నేనే సమదాయించుకొన్నాను.

అంతలోనే హటాత్తుగా ఆపోశనాలు పోశారు. ఆ సాధ్వీమణి ముందుకు వచ్చి కలకంఠ కంఠ మాధుర్యంతో

"పోసారా అందరికి ఆపోశనాలు?
అరగించండి. కానీయండి, అమృతమస్తు

ప్రొద్దు పోయింది. నిదానంగా కూర్చోండి.

మీకందరికి నా మ్రొక్కులు." అని భక్తితో అంజలిఘటించింది.

విస్తళ్ళలో ఏమీ లేకపోయినా ఆ మాతృదేవి మాట మీద ఆపోశనాలు పట్టామో లేదో, ఆదేమి చిత్రమో గాని, దివ్యాన్నం, పిండి వంటలు షడ్రసీ సామగ్రీ రుచిమ త్పదార్థనిచయ మంతా ఒక్కమారుగా సంసిద్ధమైంది.

ఇక ఊపిరాడకుండా భుజించాం. పదార్థాలు అమృతాయమానంగా ఉన్నాయి. వడ్డించిన వాళ్లేలేరు. ఎవడెంత పదార్థం కావాలని చింతిస్తే అంత పదార్థం అరటాకు మీద అవతరించింది.

పప్పు, పిండి వంటలు, గుడాలు, విస్తరిమట్టు కుప్పలుగా వచ్చి చేరాయి.

మిత్రమా! ఆవిందును వర్ణించటం నా వల్లకాదు. ద్రాక్షాపానక ఖండశర్కరాలు, రంభాఫలశ్రేణులు, గోక్షీరాలు, మండెగలు, క్రొన్నేయి, పాయసం, ఎన్నెన్నో! మల్లెపూల కన్న తెల్లనైన ఏరుబాల కలమాహారం కుక్షులు నిండేటట్లుగా భక్షించి, అక్షుద్రక్షుధా శాంతి కావించాం.

ఆ సాధ్వి అన్నపూర్ణాదేవి తప్ప అన్యులెవరు కాదని, అప్పుడు నా మనస్సుకు స్పష్టమైంది.

మామనః ప్రమోదానికి, అంతు పొంతులేదు. మా ఎన్నాళ్లు చేసుకొన్న తపస్సు ఆరీతిగా ఫలించిందా! అనిపించింది. ముగించలేక ముగించలేక ఎలాగో ముగించి, అతి కష్టం మీద ఆచమన క్రియ ఆచరించాం.

సంయమీంద్రా! మా భుక్తాయాసాన్ని గమనించి, అన్నపూర్ణాదేవి విమల సౌధమధ్య వేదికాస్థలంమీద విశ్రమించమన్నది. అలా కాసేపు విశ్రమించామో లేదో అంతలోనే శిష్యులలో కలకలం పుట్టిందీరీతిగా.

*     *     *     *     *

శిష్యులు

గురుదేవా! గురుదేవా! లేవండి, లేవండి

వ్యాసుడు

అప్పుడే ఏం కొంపమునిగింది? కాసేపు విశ్రమించనీయండర్రా.

వైశంపాయనుడు

కొంపే మునిగింది గురుదేవా! కాస్త లేచి అటు తిలకించండి. చంద్రబింబానన,

సుమంతుడు

చంద్ర రేఖామౌళి!

పైలుడు

నీల కుంతల భార!

జైమిని

నీల గళుడు!!

దేవలుడు

ధవళాయతేక్షణః

రోమహర్షణి

ధవళాఖిలాంగుడః॥

సూతుడు

మదన సంజీవని।

వైశంపాయనుడు

మదన హరుడు॥

సుమంతుడు

నాగేంద్ర నిభయానః

పైలుడు

నాగకుండల ధారిః।

జైమిని

భువన మోహనగాత్ర॥

దేవలుడు

భువన కర్త॥

రోమహర్షణి

గిరిరాజ కన్యక!!

సూతుడు

గిరిరాజ నిలయుడు!

వ్యాసుడు

అవునవును. గౌరీ విశ్వనాథులు.

జయవిజయలు సరసన లేకుండా, నందికేశుడు ముందర నడచి రాకుండా, ప్రథమ దంపతులు సంభ్రమ విరహితంగా వేంచేస్తున్నారు. ఇది మహాద్భుతం.

నాకు జరిగిన అవమానానికి బాధపడి, ఇంతటి విందు ఏర్పాటు గావించి, ఇంకా ఓదార్చటానికి వేంచేస్తున్నారేమో! ఎంతటి కరుణ!!

[దీనంగా] కాదు, కాదు. ఇరువురి ముఖకవళికలు భిన్నంగా ఉన్నాయి. గిరిజా జనని ముఖంలో అంచిత మహాకారుణ్య సంపత్తి గోచరిస్తున్నది. గిరిజాపతి ఆననంలో ఉద్యత్క్రోధ సంరంభం ఉట్టిపడుతున్నది.

తల్లిముఖంవంక చూస్తుంటే సంతోషం, తండ్రివంక చూస్తుంటే సంక్షోభం పిరిగొంటున్నది.

భూతేశు డేంచేస్తాడో! రోట్లో తలబెట్టి రోకటి పోటుకు వెరచి లాభ మేముంది?

[ఆలోచించి] అవగతమైంది. అన్నపూర్ణాదేవి సూచించిందికదా! కాశీ శివునకు శుద్ధాంత కాంత. ఆమెపై అలిగి, కాశీపతి కోపానికి గురి అయినాను. కాశీ, గిరిజాదేవికి సవతి. ఆ మాత్సర్యం ఎంత వాళ్ళకైనా తప్పదు. కాశిని శపించటంవల్ల ఆమె ప్రేమకు పాత్రుడనై ఉంటాను.

పార్వతీ పరమేశ్వరు లడుగులు తీవ్రంగా వేస్తున్నారు.

శిష్యులారా! రండి రండి. ఈ పురాణ దంపతులకు ప్రత్యుత్థానం చేసి సాష్టాంగ దండప్రమాణాలు కావించండి!

శివా! భవతాపహరా!! కృపావీక్షణ ప్రసారంతో కరుణించండి. ఏ దిక్కున, వీదిక్కే మాకు దిక్కు శరణ్యా!!

పరమేశ్వరుడు

[కోపంతో] చాలు, చాలు, నీ వంక దణ్ణాలు. దురాత్మా! పీవార ముష్టింపచాభాసా!! యోజనగంధి ప్రథమ పుత్ర! దేవరన్యాయ దుర్భావనా పరతంత్ర! బహుసంహితా వృధా కాలపతన!! భారతగ్రంథ గుంభన పండితమ్మన్యా!!

అశేష కైవల్య కల్యాణ ఘంటాపథమైన కాశికాపురిని విష్కార ణంగా శపిస్తానని అనాచార సరణితో అహంకరించి అడుగు పెట్టావు కదూ!!

పో! నిర్భాగ్య! నీవు, నీశిష్యులు ఈ పొలిమేరల్లో కనిపించరాదు.

పోకుండా నడగొట్టి యిక్కడే తిరుగాడావో: దావక్షుణ్ణంద నీ మొగాన్ని రాకింప చేస్తాను.

శ్రీ కాశికను నిందించిన నీచ చరిత్రుడవు. నీవు సంచరించిన కాశి 'వ్యాసకాశి'. అందులో మరణించిన వారికి సద్గతు లుండవు.

వ్యాసుడు

(చెవులు మూసికొని, తనలో) శివశివా! ఎటువంటి దారుణ శిక్ష. [జాలిగా తల్లి వంక చూస్తాడు]

పరమేశ్వరి

ఊరుకుందురు. మరీ ఇంత కోపమా? ఇంతటి పరుషభాషణమా! మహామేధావి!! ఏంత దీనుడైనాడో చూడండి. జాలి వేస్తుంది పాపం.

అప్పటికప్పుడు పొమ్మంటే, ఇంత పెద్ద సంసారంతో ఎక్కడికి పోతా డీబిడ్డ!

కుమారా! వ్యాసమునీ! ఇటు ప్రక్కకురా! ఒక్కమాట నీ చెవిలో ఊదాలి.

[రహస్యంగా] మంచి పనిచేశావు. కాశి గర్వమణచావు. నీ ఉపకారం నేనెప్పటికి మరవను.

ఎక్కడికి పోదామనుకొంటున్నావు? నేను చెప్తాను విను. సరాసరి దక్షిణ దేశంలోని దక్షవాటికకు పో! అక్కడి భీమనాయకుడు దయామూర్తి. సమస్తాభ్యుదయాలు నీకు గల్గుతాయి.

వ్యాసుడు

అమ్మా! నీ వాత్సల్యానికి అత్యంత కృతజ్ఞులం. నీ సలహా ప్రకారం దక్షారామానికి పోయి, భీమనాయకుడ్ని సేవిస్తు శేషజీవితం గడుపుతాను.

* * * *

కుంభసంభవా! ఇదీ నా దీన వృత్తాంతం. ఆలకించావు గదా! ఆవగింజంత అనవధానతకు పర్వతమంత అపరాధభరాన్ని మోపి, పరమేశ్వరుడు నిర్దయగా కాశినుండి మమ్మల్ని వెడల నడిపించాడు.

అక్కడ క్షేత్రకాలభైరవుని చిత్తం కఠినపాకం. డుంఠి విఘ్నేశ్వరుడికి ఈరస మెక్కువ. కాశీ మాబోంట్లకు కానిబ్రతుకే అయింది. ఏం చేయను? (కన్నుల నీరు నిండుతాయి)

ఈ భీమనాయకుడైనా మమ్మాదరిస్తాడా? మా అవమానం సమసిపోతుందా?

అగస్త్యుడు

పారాశర్యమునీంద్రా! సామాన్య మానవుడిలాగా నీవంటి మహాత్ముడు కన్నీరు నింపటం భావ్యంకాదు. ఊరడిల్లు, ఊరడిల్లు.

మనల్ని సంస్కరించటానికే పరమేశ్వరుడు అప్పుడప్పుడు ఇటువంటి పరీక్షలు పెడుతుంటాడు. మనమేదో సర్వజ్ఞుల మనుకుంటామేమో! అని ఆయన భయం.

అన్నీ మన మంచికోసమే! మానవుడెంత వాడౌతున్నా, మానసికంగా శిశు మనోనైర్మల్యాన్ని పోగొట్టుకో కూడదు అమ్మదగ్గర మనకభిమాన మేమిటి? అమ్మ ఒడిలో ఒదిగి పోగల్గాలి. అమ్మ మాటలు గంభీరార్థ సంభరితం.

ఎంత తపస్సు చేసినా, మనమింకా అన్నమయకోశాన్నే అతిక్రమించ లేదనేదే అమ్మ మాటల్లోని ధ్వని. ఈ సంఘటన అందుకు ఉదాహరణంగానే ఉంది. ఆనందమయకోశంలో విహరించవలసిన వారిమి. మనం పద సోపాన పటంలో మొదటికి చేరినట్లైంది.

విచ్చమెత్తుకోటం జన్మహక్కా ఏమిటి? వినయంతో అమ్మ నాశ్ర యిస్తే ఎంతో ఆనందజనకంగా ఉండేది. 'విద్యా దదాతి వినయం' అని నీవు పేర్కొన్న సూక్తేగదా! నీవే విస్మరించావు. అందుకే చదువుల 'ఒజ్జల పుచ్చకాయ' లని లోకం హేళన చేస్తుంది.

ఎంతవారికైన అహంకార మెంత అనర్థదాయకమో! లోకం నీవల్ల బాగా గుర్తు పెట్టుకొంటుంది. రచనకు ఆచరణకు మధ్యలో ఎంత అఘాత ముంటుందో ఈ నీ వృత్తాంతం సాక్ష్యమిస్తుంది. అవమానాన్ని భరించటానికి కూడ శక్తి కావాలి కదా! అందుకే పరమేశ్వరుడు నిన్ను చేపట్టాడు—పరీక్షకు. నీపుతప్పటంవల్ల లోకం అప్రమత్తంగా ఉంటుందిలే!

ధర్మజ్ఞా! జరిగిందానికి విచారించి లాభమేముంది? ఇంకో విధంగా అన్వయించు కొందాం.

మనమందరం కాశీ నగరంలోనే ఉండిపోతే, తక్కిన క్షేత్రాలు, తీర్థాలు ఏంకావాలి?

ఆర్ష సంస్కృతి ఉత్తర దేశంలోనే ఉన్నదనే భ్రాంతి ఇప్పటికే ప్రజలలో బాగా వ్యాపించింది.

నిజానికి యావద్భారతం ఆర్షభూమి. ఆ సమైక్యభావం బాగా నాటు కోటానికే వింధ్యగర్వాపహరణం నెపంగా నేనిక్కడికి రావలసి వచ్చింది. ఈ మిషమీద నీవిక్కడి కేతెంచావు. అంతకన్న దీన్నిగూర్చి తీవ్రంగా భావించకు. తేలికగా తీసుకో. జరిగిం దోకలగా మరచిపో! ఇంకోవిశేషం.

ఈ త్రిలింగదేశం పరమ పవిత్రమైంది. ఇక్కడి ప్రజలు ఎంతటి కర్మిష్ఠులో, అంతటి జ్ఞానులు. ఎంతటి జ్ఞానులో అంతటి భక్తులు.

వారు నిన్ను ఆర్ష సంస్కృతి జనకుడుగా ఆరాధించటం గమనించి ఆనందించాను. భారతం, భాగవతం, భగవద్గీత, నిత్యం ఏదో ఒకటి వారు పారాయణం చేస్తుంటారు వ్యాసముని ప్రణీత పరమార్థాన్ని గ్రహించాలనే పరమ కౌతూహలంగలవారు. అతిధి సత్కారంలో అందెవేసిన వారు. నీ సృష్టిపట్ల వారికిగల ప్రేమాభిమానాలే నిన్నిక్కడికి రప్పించాయేమో!

సంస్కృతిపట్ల సంస్కృతంపట్ల వారి కమితాభిమానం. వీరెంతటి ధీశాలురో అంతటి ఆర్ద్ర హృదయులు.

వీరి ఇష్టదైవం భీమనాయకుడు. అత్యంత దయార్ద్రహృదయుడు.

ఈ దేశానికి పొమ్మని అమ్మ నీకు సముచితంగా సూచించింది.

## వ్యాసుడు

మిత్రమా! నీమాటలు వింటుంటే నూత్న చైతన్యం కల్గుతున్నది. భీమనాయకక్షేత్ర మాహాత్మ్యం సూక్ష్మంగా చెప్పి నాకు కొంత ఉపశమనం గల్గించు.

## అగస్త్యుడు

విద్యా వర్ధనా! నీకు తెలియని క్షేత్ర మాహాత్మ్యమా? నీ వెరుగని విజ్ఞాన రహస్యమా? మనోవైక్లబ్యం వల్ల నన్ను పెద్దను చేస్తున్నావు. అంతే!

మనీషీ! కాశి కేవలం మోక్షభూమే కాని భీమేశ్వరం భోగభూమి, మోక్షభూమి కూడా- మున్నూరు క్షేత్రాలతో కూడిన సాక్షాత్ర్పత్యక్ష మిది, అపరస్వర్గం.

ఇక్కడ ఎక్కడ చూచినా సరసే. ఎక్కడచూచినా దేవమందిరమే. ఎక్కడ చూచినా తటినే. ఎక్కడ చూచినా పుష్పవాటికలే. ఈ భీమ మండలంతో అన్యమండల మేదీ సమానం కాదు.

మహాకవీ! ఇక్కడి ఉద్యాన వనవీధుల్లోని శారికా సముదాయం పంచాక్షరీ మంత్ర పారాయణం చేస్తుంది. ఇక్కడి పుంస్కోకిలలు నీల కంఠస్తోత్రాలు పఠిస్తాయి. ఇక్కడి తుమ్మెదలు శతరుద్ర సచ్ఛ్రుతి స్వాధ్యాయం కావిస్తాయి. ఇక్కడి నెమలిపిండు ప్రణవాక్షరాన్ని షడ్జమస్వరంతో పలుకుతుంది.

ఇంతిదేనికి? ఈదక్షారామం సాక్షాత్తుగా దక్షిణ కాశిగా వాసిగాంచింది. ఈ క్షేత్ర మహాత్మ్యాన్ని పురాణీకరించి ఆర్షలోకాని కానందాన్ని ప్రసాదించు. దీనితో నీరాక సార్థక మౌతుంది.

అవిగో మధ్యాహ్నిక శివాలయ ఘంటికా నినాదాలు!! అందరం ముక్త కంఠంతో శివస్తోత్రం చదువు కొంటు పోదాం పదండి.

హరహర మహాదేవ శంభో
హరహర మహాదేవ శంభో
హరహర మహాదేవ శంభో

భరత వాక్యం

నవవికసిత కుసుమమువలె కోమలమై
సుప్రభాత మారుతమ్ము పగిదిగ స్వేచ్ఛామయమై
అచ్ఛమైన స్ఫటికమువలె శుభ్రకాంతు లెగజిమ్మె
బాల హృదయ మెవనియందు ఆజీవిత మలరారునొ
అతడె ధన్యు, డతడె యోగి, అతడె ప్రేమైకజీవి
అతని యెడద సుఖశాంతుల కాలవాలమై యొప్పును.

# నత్కీరుడు

## పాత్రలు

1. హారద్వాజుడు
2. శివుడు
3. పాండ్యరాజు
4. నత్కీరుడు
5. కుమార స్వామి
6. వైతాళికులు
7. పెనుభూతం
8. ఇతరులు

శాప మననేమి? వరమె ప్రచ్ఛన్న భంగి;
ఉద్యమించి మానవుడు మహోన్నతుడగు;
శంఖ ఫలక మహాకవీశ్వరుడు కడకు
శంక రాస్థాన కవియై ప్రశస్తి గనడె?

# మొదటి రంగం

[పాండ్యరాజ్యంలో ఒక గ్రామం. అందులో శివాలయం. గుడి గంటలు మ్రోగుతుంటాయి]

హరద్విజుడు

[నీరస కంఠంతో]

మహాదేవా! పరమ శివా!! పరమేశ్వరా! ఈపూట నీ గుడి తలుపులు తీసే ఓపిక కూడలేదు. కడసారి దీపారాధన చేసి, నీ యనుజ్ఞ తీసుకొని పోవాలని వచ్చాను.

మానిసిని మానిసి పట్టి తినే దుర్భర దుస్థితి క్షామం మూలాన ఏర్పడింది. జనానీకం ఈ దేశంనుండి తరలి పోతున్నది— ప్రాణాలు నిలబెట్టుకోటానికి.

నేనూ పోతున్నా. సెలవిప్పించు. ఎన్నో తరాలుగా మా వంశీయు లీపూజారి వృత్తిని నిరాటంకంగా నిర్వహించి నీ కృపకు పాత్రు లైనారు. కడకు నీ సేవాభాగ్యాన్ని కోల్పోక తప్పలేదు. మన్నించి యనుజ్ఞ నివ్వు. పోయి వస్తాను.

శివుడు

ద్విజోత్తమా! ఆగు, ఆగు. నైవేద్యం లేదు, సరికదా! దీపారాధనం కూడ లేకుండ నన్ను అంధకారంలో ఉంచి పోతావా?

ఒక్క ఉపాయం చెప్తాను, విను. ఇదిగో, శృంగార రసాత్మకమైన పద్యం. దీన్ని తీసుకొని వేవేగపోయి, పాండ్య నృపాలుని సభలో చదువు.

ఆ సభ మెచ్చేటట్లుగా కవిత్వం ఏ కవి చదివినా ఆ మహీశుడు వేయేసి మాడలిచ్చి సత్కరిస్తాడు.

నీకు వేయి మాడలు లభిస్తాయి ఈ పద్యానికి. దానితో కొన్ని దినాల వెచ్చం లభిస్తుంది. ఇంతలో వర్షాలు పడతాయి. కరువు తీరుతుంది.

హారద్విజుడు

మహాదేవా, మంచి సలహా ఇచ్చావు. ఏదీ పద్యం? దీనివల్ల వేయి మాడలు లభిస్తా యంటావా: సంతోషం. దయామయా, సెలవిచ్చి పంపు.

శివుడు

శుభం భూయాత్.

## రెండో రంగం

వైతాళికులు

జయ జయ పాండ్యరాజ కంఠీరవా,
జయ జయ సమస్త పాండ్యధాత్రీ ధౌరంధుర్య!
జయ జయ వైరి నృపప్రతాప సంజ్ఞాపతీ॥
జయ జయ వాసవాధిప యశస్సముదీర్ణా॥
ఉదీర్ణ దాన విద్యాపర కర్ణ॥ అర్ణవసమగ్ర గంభీరా॥
దివిష దన్నప్రాయ వాగ్గుంభ కవిపోషకా!
శైవ సంవిత్కాసార మరాళ రత్నా!
నత్కీరాది శంఖఫలక మహాకవీంద్ర బృంద సంరక్షకా!
బహూపరాక్, బహూపరాక్, బహూపరాక్

పాండ్యరాజు

మహాకవులారా! పండిత వరేణ్యులారా! నమ స్సుమనస్సులు. ఈ నాటి సభలో వివిధ దేశ నూతనాగతులగు కవుల పద్యాలు మునుముందుగా ఆలకించాలని ఉత్కంఠిస్తున్నాను. అట్టివారు ముందుకువచ్చి తమ పద్యాలు వినిపించ గోరుతాను.

హారద్విజుడు

మహాప్రభూ! నేనో హారద్విజుడ్ని, ఒక్క పద్యం పఠిస్తాను.

పాండ్యరాజు

అవశ్యం.

హారద్విజుడు

రమణీమణి ధమ్మిల్లము
రమణీయము, సహజగంధరాజిత మగుటన్
రమణా! యిదియొక యద్భుత
సుమధుర సౌందర్య సృష్టి సూ! పరికింపన్!!

నత్కీరుడు

[పకపక నవ్వుతు]

ఏమిటేమిటి? రమణీ మణి ధమ్మిల్లం సహజగంధ బంధురమా?

పాండ్యరాజు

నత్కీర కవీంద్రా! ఏమిటా పరిహాసం?

నత్కీరుడు

నేను పరిహసించటం కాదు ప్రభూ! వేనలి సహజ గంధ బంధుర మంటె లోకమంతా నవ్వుతుంది.

అది కవితాసమయ విరుద్ధం. తప్పు తప్పు. అట్లా చెప్పనేరాదు.

హారద్విజుడు

అయ్యా! తప్పో ఒప్పో నాకు తెలేదు. ఈపద్యాన్ని పఠించమని నాకు పరమేశ్వరుడిచ్చి పంపాడు.

నత్కీరుడు

ఇంతకు ఇది స్వకీయంకూడా కాదన్నమాట!! గ్రంథచౌర్యం చేసి పరమేశ్వరుడు మీదికి నెడుతున్నావు. ప్రభువులు చౌర్యాన్నైనా క్షమిస్తారు గాని గ్రంథచౌర్యాన్నే మాత్రం క్షమించరు.

వేయి మాడలు సులువుగా ఒళ్లో రాలుతా యనుకొన్నాడు పాపం!!

హారద్విజుడు

[దీనంగా]

నేనేగ్రంథంనుండి చౌర్యం చేయలేదు. నిజంగానే పరమేశ్వరు డిచ్చాడు. ఇది తప్పుల తడికయితే ఆయన ముఖానే పారవేస్తాను. ఈ పరాభవం భరించలేను. సెలవిప్పించండి.

పాండ్యరాజు

మంచిది. పోయిరా!

## మూడో రంగం

[దేవాలయ ద్వారంతలుపులు వేగంగా నెట్టిన ధ్వనులు-గుడిగంటలు వికలంగా మ్రోగుతాయి]

హారద్విజుడు

[నీరస తీవ్ర కంఠ నిస్వనంతో]

పరమేశ్వరా! ఇదిగో నీపద్య పత్రం. నీవే తీసుకో!! నీమాట నమ్మిపోతే ఆకలి తీరలేదు సరిగదా! తీవ్రావమానం పాలయినాను. నిండు సభలో సిగ్గుతో నేరసుడులాగా తలవంచుకొన్నాను.

నీవు సర్వజ్ఞుడవని, బహుముఖ నిర్వాహక శక్తిగల వాడవని నమ్మాను. నాపౌరుష గర్వం పోనాడు కొన్నాను.

ఇంతకు నిన్నని లాభ మేముంది? తప్పు నాదే. తానెరిగినవిద్యను నృపాస్థానాలలో ప్రకటించటం కీర్తిదాయకం. పరవిద్యాధీనతవల్ల భూపాల సభల్లో పరాభవం ప్రాప్తించక తప్పుతుందా?

ఆ నత్కీరునిచేత మాట పడ్డందువల్ల కల్గిన దుఃఖం, క్షామ వ్యథ కన్న మిన్నగా నన్ను దహిస్తున్నది.

నాభాగ్యం ఇలా వుంది. నిను , ఆ నత్కీరుణ్ణి, నిందించి లాభ మేముంది?

నే నేదేశమైనా పోయి బిచ్చమెత్తుకోని బ్రతుకుతాను. నాకింకా సెలవు.

శివుడు

ద్విజవర్యా! అంత తొందర పాటేమిటి? ఆగు, ఆగు. నత్కీరుడా? ఎవడు వాడు? నా పద్యంలో తప్పు పట్టాడా? పద. నేను వస్తాను. ఆ తప్పేమిటో తేలుస్తాను.

## నాల్గవ రంగం

వైతాళికులు

అర్థిజన కమల బాంధవా! నత్కీరాది శంఖఫలక మహాకవిమండల దిగంత విశ్రాంత కీర్తినిధీ! సమస్త జాతి చేతో మహోత్సవ చైతన్య మూర్తీ!

బహూపరాక్! బహూపరాక్.

పాండ్యరాజు

నూతనాగత కవిపండిత మాన్యులకు రుచిరాగతం. ఒక్కొక్కరే వేదిక నలంకరించి తమ యపూర్వకవితా రమణీయ మకరంద ధారలతో మా కానందాన్ని చేకూర్చండి.

శివుడు (ప్రచ్ఛన్న వేషంతో)

రాజేంద్రా. సాహిత్య స్ఫురన్మాధురీ వాక్ప్రౌఢిమతో మా ద్విజు డొకడు పద్యమొకటి పఠిస్తే, మాత్సర్యంతో ఎవడో నత్కీరుడట, ఊరక తప్పు పట్టాడట!!

ఆ తప్పు ఎక్కడో నిర్దేశించి చెప్పమను. లక్షణంలోనా? అలంకారంలోనా? పదబంధం లోనా? రసం లోనా?

నత్కీరుడు

నేనే నత్కీరుణ్ణి—తప్పని ఉద్ఘాటించింది. రమణీమణి ధమ్మిల్లం సహజ గంధబంధుర మెట్లా అవుతుంది? కవితా సమయానుకూలం కాదది.

శివుడు

గిరితనయా ధమ్మిల్లం సహజ గంధ బంధురం గాదా?

నత్కీరుడు

అగజకైతే అన్వయం సరిపోతుంది. భూమిమీద మగువల పట్ల సముచితం కాదుగదా!.

మాత్సర్యంమాను, గగన ప్రసూన వాదం చేయకు. దీనికోసం మళ్లీ వచ్చావా?

శివుడు

నత్కీరా! ఇటు చూడు. నేనెవరో తెలుసా?

నత్కీరుడు

మూడో కన్ను చూపిస్తున్నవా? నీ తలచుట్టు కనులు మొలిచినా ఈ పద్యం దోషరహితమని నేనంగీకరించను.

నీ మాయావిలసనాల్ని విడిచిపెట్టు.

శివుడు

[తనలో] ఓహో! మంచి ఆత్మాభిమానం గల కవి. నిర్భీకుడు. నేను పరమేశ్వరుణ్నని చెప్పక చెప్పినా, కించిత్తుకూడ చలించలేదు.

ఈతని ప్రవృత్తిలో మార్పు సాధించాలి. ఇతడు శంఖ ఫలక మాత్ర కవిగా ఉండటం కాదు. ఇతడ్ని నా ఆస్థానకవిగా స్వీకరించాలి. ఈ లౌకిక కవిని అలౌకిక కవీశ్వరుడ్ని కావించాలి.

ఈ బింకం ఎంతవరకో చూస్తాను. [కోపంగా] నత్కీరా: నీకింత దురహంకారమా? దీనికి శిక్ష తెలుసా? కుష్ఠురోగ పీడితుడవుకా.

నత్కీరుడు

[దీనంగా] కుష్ఠురోగమా? మాటకుమాట మాట్లాడానని ఇంత కఠినంగా శపించటం భావ్యమా? ఉద్యత్కృపాధామా! శాపాంతాన్ని ప్రసాదించండి. ఈ దీనుడ్ని కరుణించండి. మీ పాదాలకు మ్రొక్కుతాను.

శివుడు

నత్కీరా! లే, లే. ఆ కైలాస శిఖరాన్ని చూడు. నీ బాధ [illegible] పోతుంది. (అదృశ్యమౌతాడు)

నత్కీరుడు

అయ్యో! పరమశివుడదృశ్యుడైనాడు. [illegible] నేను కైలాస శిఖరాన్ని ఎలా చూడగల్గుతాను? ఇంతలో ఎంతటి వైపరీత్యం సంభవించింది?

శంఖఫలకంమీద కవులందరిలాగా నేనుకూడా [illegible] బాగుండేది. అనవసరంగా కవితాభిమానం వహించాను. అహంకారంతో [illegible] తోనే వాగ్వాదం చేసాను. కుష్ఠు వ్యాధి [illegible]

కైలాస శిఖర దర్శన మంటే మాటలా? ఎన్ని మహానదుల్ని, ఎన్నివనాల్ని, ఎన్ని గిరీంద్రాల్ని దాటాలో!! ఎన్ని బోయ వీళ్ళను అతి గమించాలో! ఎన్ని క్రూరమృగాల్ని ఎదుర్కోవాలో, వీటన్నింటిని దాటి ఏరీతిగా ఈశ్వర శైలాన్ని చూడ గల్గుతాను? వినటమే కాని కన్నది కాదు గదా।

ఆ త్రోవలు, హరి శార్దూల మదేభ ఖడ్గ శరభ వ్యాకీర్ణాలు. రాక్షసోత్కర సంచారాలు. హిమ పయోధారాశ వర్షాలు. ఉద్ధుర సంఘర్షణ బాధ కోపలాలు. ఏవిధంగా వీటిని దాటటం? కరుణా సాగర। భక్తవత్సల। శివా। గౌరీశా। నాకేది దారి?

క్షణం గతించిందంటె, నాపరిస్థితి హీన మౌతుంది. అవయవాలు తిమ్మి రెత్తే లోపల, ఒంటిమీద మచ్చలేర్పడే లోపల,శరీరం చెలువుదప్పి, బరువెక్కి వికృతాకారం దాల్చే లోపల నేను ప్రయాణం సాగించాలి.

ఆ వ్యాధి నూహించే కొద్ది నా హృదయం కుర్రింగి పోతున్నది. శరీరంనుండి చీము, రక్తం ప్రవహిస్తుంటె, ఈగలు మూగి వేధిస్తుంటే, ఎక్కడైన దారి మధ్యలో భిక్ష మడగటానికి పోతే ప్రజలు నన్నుచూచి ఎంతగా అసహ్యించుకొంటారో। అట్టి హీనస్థితి వచ్చే లోపలే కైలాస నగాన్ని చూడాలి. హరుని వాక్యం పరిహరింప శక్యంకాదు.

మహారాజా। మహాకవి పండితోత్తములారా। మహాజనులారా!!

నాకు సెలవిప్పించండి. ఎంత దుర్ఘటమైనా సరే, ఈ శరీరంలో తుది నిశ్వాసం వదిలే దాక ఉత్తర దిశాభి ముఖుడై సమస్త నదీనదాలలో తీర్థమాడి, ఆయాక్షేత్రాలలో దేవతా సందర్శనం గావించుకొని కైలాస శిఖర దర్శనం చేసి తీరుతాను. ఈ వ్యాధిని తప్పక జయిస్తాను. సెలవిప్పించండి. ఆశీర్వదించండి.

పాండ్య రా[illegible]

నత్కీర మహాకవీ! నీవు చేబట్టింది మహోద్యమం. నీ ధైర్యం, స్థైర్యం అభినందనీయాలు. నీ ఉత్తర దిశా ప్రస్థానం మహా తపస్పదృశం.

నీవులేని శంఖ ఫలకం చైతన్య విహీనం. నీ సమకాలికులంగా మాకు వాఙ్మయంలో శాశ్వత స్థానం లభిస్తుంది. పోయిరా! నీకు తప్పక విజయం చేకూరుతుంది.

## ఐదవ రంగం

### నత్కీరుడు

[గుడి గంటలు మ్రోగుతాయి] ఎన్నాళ్లకీ దైవం కేదారస్వామిని సందర్శించే మహాభాగ్యం ప్రాప్తించింది? ఈ మహాక్షేత్రాన్ని సంద ర్శించే కొద్దీ నన్నావహించిన భీషణాంధకారాలు తొలగిపోతున్నాయి. నన్ను వేధించే తీవ్రత రాంగ సంభవ శారీరక విదాహ వ్యాధులు [illegible]పోతున్నాయి. ఆవిర్భూతానందంతో నా హృదయం [illegible]. స్వామీ! నేను శంఖఫలక కవిని, నత్కీరుడ్ని, శంకర శాపగ్రస్తుడ్ని, అ[illegible]ంచండి

* * *

ఓహో! హిమాచలాత్మజోత్తుంగ [illegible] భవభూతి లేప సర్వాంగా! లోచనీకృత [illegible] కృశాను [illegible]! [illegible] లింగా! భక్త మనోజ్ఞశృంగా! జంగమనాథ [illegible]! నత్కీరుడు [illegible]స్తున్నాడు. దయతో స్వీకరించి ఆశీర్వదించండి.

[తరంగ ఘోష]

ఆహా! ఎంత మనోహరం! జీవన శిత ఖడ్గ ఖండిత భవ ప్రభవాఘ విరోధి సైన్య, పావన నిజనామ సంస్మరణ వారిత మానవ దైన్య నిత్య మజ్జనరతకోటి ముక్తిపద సౌఖ్యవదాన్య, ఈ కవేర కన్యాజలాల్లో కృతావగాహుడనై కృతార్థుణ్ని అవుతాను.

* * * *

అరెరే! మహోదాత్త మీ అరుణ గిరీంద్ర కూటం! ఇది కృతాఘ కపోల చపేటం! నిరంతర భవ దాహ పావక విదాహ కృపీటం! పుణ్య కోశ మందిర విలసత్కవాటం; ప్రదీపిత ముక్తి వధూ కిరీటం. పరిహృత సంతత భ్రమణ భార పథ శ్రమ భానుఘోటం! దీన్ని దర్శిస్తుంటేనే నా పాప సమూహం పటాపంచ లౌతున్నది.

* * * *

అజ్ఞామల విశ్వనాథ! మన్నాన, పౌన్నాన, పెణ్ణాన మాన్పి నన్నుద్ధరించు. తిరువత్తూరు మహాదేవా! ముక్తి వారిరుహాక్షీపతిదేవా! భవ బంధ విముక్తికై నత్కీరుడు నమస్కరిస్తున్నాడు.

ఇదిగో పరమార్థమూర్తి! కరుణాపాథో నిధానం. పర శంభుడు, కాంచికా రమణుడు, లోకస్వామి, ఏక రసాలేశ్వరుడు, మత్పాపౌఘాన్ని రూపుమాపి రక్షిస్తాడు.

* * * *

ఆంధ్రావనిలోకి అడుగు పెట్టాను. ఇది విక్రమసింహ నగరాసన్న అయిన పెన్న; ఇదే హరిహరస్వామి దివ్యాలయం. ఇదే ఆనందతరంగిత మూర్తి శ్రీ రంగనాథనాయకస్వామి కోవిల.

ఇది తీర్థయాత్రికులకు సురతరువు కొమ్మ, గుండ్లకమ్మ; ఇదిగో సుకృతి భూత పాతక శ్రేణి, కృష్ణవేణి; ఇదే కమలాచలోత్తుంగ సంగత తరంగ గౌతమగంగ; ఇది కుక్కుటేశ్వరస్వామి పీఠం, పీఠికాపురం;

అంహో మతంగ సింహం, సింహాచలం చేరుకొన్నాను. ఇది విదళితోభయ కర్మం శ్రీ కూర్మం.

ఓహో! ఇది ముక్తివధూ చరణ కటకం కటకం; దుఃఖ దహన జలేశ్వరం ఇది జలేశ్వరం; కృత వందన నందనేశ్వరమిది నందనేశ్వరం. చిద్గగనేశ్వరం ఇది గగనేశ్వరం.

పితృముక్తి నివాసం గయాస్థానం చేరగల్గాను.

రోమాంచ స్వేద జలాశ్రుపూర జనకాత్మానంద సంపన్మనో పంచాగ్రస్థిత విశ్వనాథ పద సమ్యగ్గంగ గంగానది. గంగాస్నానం చేసి మోక్షస్వామి విశ్వేశ్వరుడ్ని దర్శిస్తాను. ఇక్కడి ఈశ్వరుని, విశాలాక్షిని కొలుస్తాను. భక్తితో కాలాంతకుడ్ని కాలభైరవుడ్ని కీర్తిస్తాను. యాత్రోత్సాహంతో కళ్యాణమూర్తిని, డుంఠి ద్విపాస్యుడ్ని సందర్శిస్తాను.

పంచక్రోశ విస్తీర్ణ పుణ్య క్షేత్రమా! శంకరశైలదర్శ నాశాబద్ధితో గుహ్యక సమ్రాడాశాగమ నాభిముఖుడ్ని నన్నాశీర్వదించి సెలవిప్పించు.

* * *

ఎంతో కష్టంమీద పయనించి పయనించి నిర్మానుష్యం. జహాపత్రే నిష్ఠురమైన ఈ ఉత్తాల శైలాంతర కానన మధ్యంలో చిక్కుపడ్డాను. ఇంక పయనించ వలసిన దిక్కు కనిపించటం లేదు.

[ఆయాసంతో] ఇంక నాకు అడుగు అమడగా ఉంది. చీము, నెత్తురు మేనులో చిమ్ముతున్నాయి. ఈగలు మూగి రేగి ఝుంకారాలు చేస్తున్నాయి.

తొంగి దోగి కొన్ని జంగ లెట్లాగో వేయగల్గాను గాని యింక అడుగుతీసి అడుగు మోపే ఓపిక కనిపించటం లేదు.

అదిగో అద్భుత సరోవరం! అది హంస సంస దభీష్ట విహార హేతువు. బహూదక హృద్యంగా ఉంది. అప్రతర్క్యము, అద్వంద్వము అయిన ఈ పంకజాకరం బ్రహ్మంలాగా పూర్ణంగా గోచరిస్తున్నది. అంతే కాదు. పద్మాల రజోవికారంతో, దట్టంగా వాసనలు క్రమ్ముకొన్న ఈ తమ్మికొలను భావిస్తుంటే 'భవం' లాగా కనిపిస్తున్నది. దీన్ని సమీపించి పథిశ్రమం అపనయించు కొంటాను.

ఎంత గంభీరం! ఎంత సువిశాలం ఈ వటవృక్షం? తన పలాశ శ్రేణితో ధరణి కంతటికి ఈ వృక్షం పచ్చని పట్టుపుట్టం మేల్కట్టు కట్టు తున్నట్లుంది. దీని ఊర్ధ్వ శాఖా వితానం సురలకు మరకత హర్మ్యాల్ని విరచిస్తున్నది. దీని శాఖల్నుండి వ్రేలాడే ఊడలు మునులకు పర్ణశాలా కలాపాల్ని కల్పిస్తున్నది. గయాప్రసిద్ధ వటవృక్ష సదృశ మీవృక్షరాజం. దీని నీడలో కొంచెం విశ్రమిస్తాను.

ఆశ్చర్యా మాశ్చర్యం! ఇక్కడినుండి సరస్సులోకి రాలిపడుతున్న పండుటాకులు, మీనాలుగా మారుతున్నాయి. అరెరే! బయట రాలిపడు తున్న ఆకులకు రెక్కలువచ్చి విహంగా లవుతున్నాయి ఎంతటి అద్భుత దృశ్యమిది! ఇంకా విచిత్రమీ దృశ్యం. సగం నీళ్లలోను, సగం బయటా ఉన్న ఆకులు మీన పక్షిత్వాల్ని వహించాయి. పక్షి బయటకు లాగు

తుంటే, మనం నీళ్లలోకి లాగుతున్నది. ఇది నా ఆత్మస్థితినే ప్రదర్శిస్తు న్నట్లుంది.

* * * *

అమ్మో! ఏమిటావికృతాకృతి? క్రూర నిరీక్షణ ప్రభల్ని వెలిగ్రక్కే ఆ మిడిగ్రుడ్లు; వికార దీర్ఘాలైన కోరలు; ఒడలు జలదరింపజేసే ఊర్ధ్వ కేశాలు; నీల సింధ గాత్రం; ఏవేవో నిష్ఠురోక్తు లాడుతు ఆ పెనుభూతం అట్టహాసంచేస్తు భయంకర కరవాలంతో మానవాస్థి హారాలు దాల్చి నాపైపైకే తీవ్రంగా అడుగులు వేసుకొంటు వస్తున్నది. ఆత్మరక్షణ కాసింత కానే దక్షతకూడా లేనివాడ్ని. నేనేలాగూ కైలాసాన్ని చేరలేను. హాయిగా ఈ శరీరాన్ని ఈ పెనుభూతాని కర్పిస్తాను. ఇదే సముచిత విముక్తి.

పెనుభూతం

[వికటంగా] ఎవడురా నీవు? పిల్లవాడిలాగా పోరాడుతున్నావు? ఓహో! కుష్ఠురోగివా? అయినా నన్నేం చేస్తాయి ఈ రోగాలు? పో! నెమ్మదిగా ఆ గుహలో దూరు. త్వరలో స్నానంచేసి వచ్చి మిమ్మందరికి ఒకేసారి విముక్తి చేకూరుస్తాను.

[గుహలోకి నెట్టిన చప్పుళ్లు]

ఒకడు

[తనలో] వీ డెక్కడ దాపురించాడో! చెప్పినా, వీడితో మూడుగుర మైనాం. ఇక అందర్నీ ఏకాహారంగా స్వీకరిస్తుం దీ భూతం. అందుకే స్నాన మాడటానికి వెళ్లి ఉంటుంది.

నక్కీరుడు

అయ్యలారా: నామూలంగా మీకేదో కష్టం వాటిల్లే సట్లు కనబడ్డ ట్టి తెలుస్తుంది. ఆ ఆపదేమిటో కాస్త నాకు చెప్పి వేయండి

ఒకడు

ఏం చెప్పమంటావు నాయనా? ఆ ఆలరి బమ్మ నిన్ను చేర్చా డిక్కడికి. ఇక మమ్మల్నందరిన్నీ భక్షిస్తుం దీభూతం. నీతో నూరుగురం పూర్తి అయినాం. మనల్ని నూరుకు తింటుంది.

నతీహరుడు

భయపడకండి. భయపడకండి. నావల్ల మీకందరికి ఆపద వాటిల్లటం సహించలేను. ఆ పుణ్యత్తనయుడు, తారక దమనుడు మనల్ని రక్షిస్తాడు- ఆ స్వామిని ప్రార్థిద్దాం. అందరు అంజలి ఘటించండి.

ఓతారక దైత్యభంజనా! దారుణ శక్తిధరా! పన్నగాహార హయా! దీనజన తామర భూజమా! షణ్ముఖాట్ట హాసారభటీ విపాటిత దిగంత కటాహా! ఈ పెను భూతాన్ని పట్టి మట్టిబెట్టి అందరిని బ్రదికించు స్వామి!

తారకు నంతవాణ్ని అలవోకగా అంత మొందించిన మహావీరుడవు. నీకీ భూతం ఓ లెక్కలోది కాదు. నిర్ఘాతం వంటి శక్తితో క్రౌంచ పర్వతాన్ని చీల్చిన నీకీ అద్రి గుహాలయం ఎంత మాత్రం? దేవతార్తి నివారించిన నీకీ దీనజనుల భీతని తొలగించటం ఎంతపని? ప్రసన్నుడవుకా! రక్షించు, రక్షించు.

[భూతాన్ని పరిమారుస్తున్న పెద్ద పెద్ద ధ్వనులు]

కుమారస్వామి

రండి, రండి. బిలంనుండి వెలువడి మీమీ నెలవులకు పోండి. మీకేం భయంలేదు.

[జనం క్రమంగా నిష్క్రమిస్తున్న సవ్వడులు].

[తనలో] ప్రాణ భీతితో అందరు వెంటవెంటనే నిష్క్రమిస్తుంటే ఇతడెవడో దేగుతు నన్ను సమీపిస్తున్నాడు.

నత్కీరుడు

ఇష్ట దేవతావరేణ్యా! సాష్టాంగ నమస్కృతులు. భక్త శరణ్యా!

కుమారస్వామి

నీవు శంఖఫలక మహాకవివి—నత్కీరుడవు కదూ?

నత్కీరుడు

అవును స్వామి! అవును. సరిగా గుర్తించారు.

కుమారస్వామి

ఇక్కడికి వచ్చా వేమిటి?

నత్కీరుడు

తమకు తెలియని విషయమా? దీనకల్పకా, నేనో తప్పు చేసాను. మహేశుడు నన్ను కుష్ఠురోగివి కమ్మని శపించాడు. శాపమోక్ష మర్థిస్తే కైలాస శిఖర దర్శనం చేస్తే వ్యాధి పో తుందన్నాడు.

ఏరీతిగా ఆశిఖర దర్శనం నాకు లభిస్తుంది? అత్యుత్తర మార్గం దుర్గమం. ఏంచేసేది?

కుమారస్వామి

అదా నీభీతి: భయపడకు. పితృపాదులు 'కైలాసం' అన్నారే కాని ఉత్తర దిశాకైలాసం అనలేదుగదా. దక్షిణదిశా కైలాసాన్ని చూస్తే సరిపోయేది. అయినా ఇంత మారం ప్రస్తావించిన నీ ఆగ్రహం అత్యం

తాదర్శం. ఆరోగ్యవంతులైన మానవు లనేకులు చేయలేని పనిని, రుజా పీడితుడవౌతు నీవు సాధించావు. పౌరుషమంటే యిలా ఉండాలి. ఉద్యమించిమానవుడు మహోన్నతు డౌతాడన టానికి నీ చరిత్రే నిదర్శనం.

ఇంకా నిన్ను బాధించటం భావ్యంకాదు. ఒక్క ఉపాయం చెప్తాను చెయ్యి.

ఈ నెత్తమ్మి కొలను మిక్కిలి మహిమో పేతం, చూచావు గదా! ఇందులో స్నానమాడు. నీకు కైలాస దర్శన మౌతుంది.

[నిష్క్రమణం]

నత్కీరుడు

[తనలో] మహాభాగ్యం. మహాప్రసాదం. ఇప్పుడే స్నానమాచరిస్తాను. స్వామి వాక్యాలు అమోఘాలు.

[మూడు మార్లు స్నానమాడిన ధ్వనులు]

ఆహా! ధన్యుడ్ని! ధన్యుడ్ని!! అదే అవాచీన స్థాణునగం. హేమముఖరీ సింధు ప్రతీరంలో ప్రకాశిస్తున్నది. నా కుష్ఠువ్యాధి అంతరించింది. నూత్న తేజస్సు ఓజస్సు చేకూరాయి.

ఓ గిరిజాధీశా! శివా! దేవతా శ్రేష్ఠా! నామానసం భవన్నిష్ఠా గరిష్ఠమైంది. సత్వోద్రేక విలసిత భవ్య కవితావేశం నాలో ఉప్పొంగు తున్నది, నిన్ను ఆశువుగా సంస్తుతించి తరిస్తాను.

జలకంబుల్ రసముల్, ప్రసూనములు వాచాబంధముల్, వాద్యముల్
గల శబ్దధ్వను, లంచితాంబర మలంకారంబు, దీప్తుల్ మెరుం
గులు, నై వేద్యము మాధురీ మహిమగా, గొల్తున్ నినుం భక్తిరం
జిల, దివ్యార్చన గూర్చె నేర్చిన క్రియన్ శ్రీకాళ హస్తీశ్వరా!!"

శివుడు

సాహిత్య శ్రీవరా! నత్కీర కవీశ్వరా! నీ భవం ధన్యమైంది. నీ భవ్యభక్త్యావేశ ప్రఫుల్ల కవితాప్రసారానికి పరమానంద భరితుడ్నైనాను. నీకిష్టమైన వరం ఏదైనా కోరుకో. ప్రసాదిస్తాను.



నత్కీరుడు

పరమశివా! భక్తసులభా! నా అల్పకవిత్వాన్ని ఆలకించి ప్రత్యక్షమైనావా? ప్రమద గద్గద గళంతో మాటరావటం లేదు. రోమోద్గమం అలముకొన్నది. ఒక్క మనవి : ఈ సంసారం, దుఃఖానికి ఆవాసం. దీన్ని వర్జిస్తే కలిగే పరమసౌఖ్యం ఏదో అది నాకు సదా కరతలామలకం గావించు చాలు. నాకింకేమీ అవసరం లేదు.



శివుడు

[తనలో] ఇతని భక్తి పచేళిమమైంది. లౌకిక వాసనలు పూర్తిగా నశించాయి. సాయుజ్యాని కీతడర్హుడు. ఇతఃపూర్వం లౌకిక కవితా సామ్రాజ్యాన్ని ఏలుకొన్నాడు. ఇక నా ఆస్థాన కవీశ్వరుడై అలౌకిక కవితారాజ్య మేలుకొంటాడు. [జనాంతికంగా]

అలౌకిక మహాకవీ! నత్కీరా! నీకు సాయుజ్యాన్నే ప్రసాదిస్తున్నాను. నిన్ను నా ఆస్థాన కవీశ్వరుడుగా నిర్ణయించాను. రా!

నత్కీరుడు

సాయుజ్యమా! కరుణామయా మహాప్రసాదం. అవిద్యాసూత్ర దాత్రీ! జీవన ఖేదాంబర కర్తరీముఖా! కైవల్యార్థ దానామృతాశనరత్నా!

తుషారశైల తనయా దాంపత్య సంపన్న పావనగార్హస్థ్య జీవనా: శ్రీ కాళహస్తి పురాధీశ్వరా॥

మహాపదవినే ప్రసాదించావు. అందుకే నిన్ను భక్తకల్పక మన్నారు. శంఖఫలక లౌకిక కవిని కరుణించి, శపించి, అలౌకిక కవిని గావించారు. శంకరాస్థాన కవిపీఠాన్ని చేకూర్చావు. మీరిచ్చింది శాపం కాదు. అది ప్రచ్ఛన్న వరం. మీ దయాంతఃకరణం అమృతాతీతం. అనుగమిస్తున్నాను.

ఓం నమశ్శివాయ. ఓం నమశ్శివాయ. ఓం నమశ్శివాయ.

భరతవాక్యం

పట్టుదల కన్న మిన్న తపమ్ము లేదు;
పౌరుషము కన్న వేరె దైవమ్ము లేదు;
ఎంత శాపోపహతుడైన కృషియొనర్చి
పరమ మాహేశ్వరుని కృపా పాత్రుడగును

---

## కృతజ్ఞత

'పరిచయం' రాసిన డాక్టర్ అమరేంద్రగారికి, ముద్రణం అందంగా చేసిన శ్రీ లక్ష్మీప్రెస్‌వారికి మా కృతజ్ఞతలు.

కె. గిరిజాప్రసాద్,
పబ్లిషర్.





# శ్రీ గిరిజా ప్రచురణలు

విద్యాలంకార్, బి - 31

శ్రీనివాస నగర్ కాలని, గుంటూరు - 6


## డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తంగారి రచనలు

(లభించేవి)

1. తెనుగు వ్యాకరణ వికాసం

   రెండు సంపుటాలు

   (1200 డెమ్మీ పుటలు) రు 32-00

2. కాళిదాస కవిత

   (విస్తృత పునర్ముద్రణం)

   రెండువందల డెమ్మీ పుటలు రు. 10-00